

సాహిత్య మాసపత్రిక

# 359

మార్చి, 1984

సంపుటి : 30, సంచిక 12

వార్షిక చందా : పది రూపాయిలు

విడిప్రతి : ఒక రూపాయి

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

# హిందీ ప్రచారక విద్యాలయం, అవనిగడ్డ



ఆంధ్రప్రదేశ్ రాజ్యపాల్ శ్రీ రామలాల్, శ్రీమతి రామ్‌లాల్ గారు అవనిగడ్డ, హిందీ ప్రచారక విద్యాలయం దర్శించినప్పుడు తీయబడిన ఛాయాచిత్రం. ప్రిన్సిపాల్ కుమారి సీత, ప్రచారక విద్యాలయ విద్యార్థినులు యిందుగలరు.

# ఈసంచికలో

సంపాదకీయం :

# ప్రస్తుత విద్యావిధానంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయబోతున్న మార్పు

ఒకటవ తరగతి నుంచి పదవ తరగతి వరకు గల యీనాటి విద్యా విధానంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మార్పు తీసుకొని రావాలని గట్టిగా నిర్ణయించుకొన్నట్లు తెలుస్తున్నది. ముఖ్యంగా ఆరవ తరగతి నుంచి పదవ తరగతి వరకుగల పాఠ్యక్రమంలో వృత్తికి ప్రాధాన్యం యిచ్చి 10వ తరగతి చదువు పూర్తి అయ్యేసరికి పిల్ల వాడు ఏదో ఒక వృత్తిలో దక్షత సంపాదించి, తనకాళ్ళ మీద తాను నిలబడ గలిగే స్థితిలో వుండాలనేది యీ విద్యా విధాన మార్పుకు ప్రధాన లక్ష్యంగా కనిపిస్తున్నది. యీనాటి భారతదేశ పరిస్థితులను, యిప్పటి విద్యావిధానాన్ని గమనించిన ప్రతిపౌరుడు యీమార్పుకు స్వాగతం చెప్పక తప్పదు.

భారతావనికి స్వాతంత్ర్యం లభించి 36 సంవత్సరాలు గడిచి పోయినా విద్యారంగం పూర్తిగా నిర్లక్ష్యం చేయబడిన విషయం సర్వులకు విదితమే. అందువల్లనే యీనాటి స్కూళ్లు, కాలేజీలు అశాంతికి, అలజడికి నిలయాలై పోయి ఆంగ్లమానస పుత్రుల్ని, క్లర్కు పోస్టులకు పనికి వచ్చే వాళ్ళను పట్టాలిచ్చి దేశం మీదకు వదులుతున్నాయి. హైస్కూళ్ళ పరిధి దాటిన తరువాత కాలేజీల్లోకి అడుగుపెట్టిన యువకుల్లో ఎక్కువ మంది భావిభారతపౌరులుగాను, దేశ సౌభాగ్యవిధాతలుగాను రూపొందేటందుకు బదులు, అనేక దుర భ్యాసాలకులోనై తల్లి తండ్రులకేగాక, సమాజానికి కూడా కంట కాలుగా తయారవుతున్న విషయం నగ్న సత్యం.

అందుకనే మహాత్మా గాంధీగారు వార్ధా విద్యా విధానాన్ని దేశం ముందుంచారు. ఆ విద్యా విధాన లక్ష్యం కూడా వృత్తి ప్రధా

నమైనదే కాని ఆ తరువాత వచ్చిన భారత ప్రభుత్వం, ప్రాంతీయ ప్రభుత్వాలు లక్ష్యశుద్ధి లేక బాపూజీ చూపిన విద్యా విధానాన్ని నగుబాటు పాలుచేశాయి. అప్పటినుంచి సరస్వతీ పీఠాలుగా విలసిల్ల వలసిన విద్యాలయాలు అశాంతికి పీఠాలై నిరుద్యోగుల్ని తయారు చేసే కార్ఖానాలుగా మారిపోయాయి. ఎన్నో కమిటీలు పర్పడటం, నివేదికల రూపంలో ఉద్గ్రంధాలు తయారు చేయడం, వాటిని ప్రభుత్వాధి నేతలకు సమర్పించడం, చదివే వారు గాని, అమలు చేసేవారు గాని లేక, అవి ఉపాధ్యాయ ప్రశిక్షణ కోర్సుల్లో పాఠ్యాంశాలుగా మాత్రమే మిగిలి పోవడం జరిగిందే కాని ప్రత్యే కించి చెప్పుకోతగ్గ మార్పు విద్యారంగంలో జరుగలేదు.

బానిస చదువులకు స్వస్తి చెప్పి, యిప్పటి కాలానికి అనుగు ణ్యంగా, స్వయంపోషకత్వానికి, క్రమశిక్షణకు, నాంది పలికే విద్యా విధానం ఆంధ్రప్రదేశ్ కేగాక యావద్భారతావనికి ఎంతో అవసరం. యీ పద్ధతిలోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యోచిస్తున్నందుకు హర్షం ప్రకటిస్తున్నాము.

అయితే యీ రంగంలో జాగ్రత్తగా అడుగు వేయడం అవ సరమని భావిస్తున్నాం. వృత్తి ప్రధానమైన విద్యా విధానం విజయ వంతం కావాలంటే సాంకేతిక పరిజ్ఞానం కల ఉపాధ్యాయులు, వైజ్ఞా నిక పరికరాలు చాలా అవసరం. ముందు యీ రెండిటినీ సమ కూర్చుకొని గట్టి నిర్ణయంతో రంగంలో దిగాలి. యిప్పటి పాఠ్య క్రమంలోను, యిప్పుడున్న పీరియడ్లలోను చాలా మార్పులు చేయ వలసి వస్తుంది, యీ రకమైన మార్పులు జరిగినప్పుడు గతంలో కలిగిన అనుభవాన్ని బట్టి స్కూళ్ళలో భాషా బోధనకు దెబ్బ తగు లుతూ వున్నది. సాంకేతిక దక్షతతోబాటు, భాషా పరిజ్ఞానం కూడా బిడ్డలకు చాలా అవసరం. ప్రస్తుతం త్రిభాషా సూత్రం ఆంధ్ర ప్రదే శ్లో అమలులో వున్నది. యీ సూత్రాన్ని పరిరక్షిస్తూ పైమార్పు లకు పూనుకోవడం అవసరమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మనవి చేస్తున్నాము.

# మంచు అద్దాలలో మండే బింబాలు

చెన్నోజు రామ్మోహన్

నా దేశం—తన ముఖం చూసుకుంటున్న
అందాల ఎవరెస్టు కొండల సజీవ మంచు టద్దాలలో...
ముప్ఫయారేళ్ల సుందర స్వప్న సామ్యవాద రీతి
సమాజ స్థాపన సిద్ధాంత పరదాల మాటున
స్వప్రయోజన తమస్సు బలిసి నెరిసిన తలలు
ప్రజాహత్యా అనౌచిత్య ప్రవర్తనా ప్రహసనాలు
కడు బీదల ఆకలి కేకల మార్మ్రోతల
గుండె గుడులలో లబ్ డబ్ గంటల గణగణలు
పచ్చి ప్రజా కంటకులు విడుచు విషపు నిశ్వాసాల
కల్మష కలుషిత పొగల భగభగలు—
పెచ్చు పెరిగిన అనైతిక గుబగుబలు
కుబుసం విడిచిన కోరికల రివరివలు—

పైన—

పర్వత శిఖరాగ్రంలో
అనంత విస్తృత మహా శూన్యస్కంధారవంలో
రక్త పిపాస శక్తియుత సాహసి
రాబందొకటి విశృంఖలంగా విహరిస్తోంది—
సర్వసత్తాక సార్వభౌమాధికారాన్ని పరిపూర్ణంగా
నైవేద్యం చేయించుకుని అజమాయిషీ నెరపుతోన్న జీవిలా!
ఈ కరాళ కాల నాళికా స్రవంతి మీద పుష్కరంపైని అలా అలా!

క్రిందుగా—

హిమనగ్నవుల మంచు అద్దంలోని
లోయల లోలోతుల ఛాయల వైపు మళ్ళీ దృష్టి మళ్ళించి చూస్తే...
కన్నీటి కడలి కౌగిటిలో క్రోధాగ్ని జ్వాలలు
అట్టి అగ్ని జ్వాలలలో కడలీ కెరటాల ఉద్యమ ఉప్పెనలు
అవినీతి మంచు గర్భంలో రాజుకునే నైతిక మంటను నాలుకలు
పదవీ వ్యామోహాల గుండె మంటలలో
తెర మరుగై పరితపించు మానవతా మంచు శకలాలు
ఓ వైపు—స్వార్థ శక్తుల రాగద్వేషాల పైశాచిక సంకేతాలూ
మరోవైపు—త్యాగాల విచ్చు గులాబీల
మానవతా పుష్పరాగ గుబాళింపూనూ—
తల్లి దేశమాత ఏకధాటి కన్నీటి రక్తాశ్రువుల మోహరింపు—
సృష్టి రహస్యాలైన జనన మరణాల పరస్పర ధూషణల హూంకరింపు—
తెల్ల తెల్లని మంచు అద్దమంతా మెల్లిగా ఎర్ర యెర్రగా—
అస్పష్టంగా—కోలాహలంగా—గజిబిజిగా—రణగొణగా—
—క్రమ క్రమేణా దృశ్యం యావత్తూ ద్వంద్వమైపోతోంది
—క్షణ క్షణమూ హృదయ కుహరంలోనికి మిథ్యాబింబం
తొంగి చూస్తోంది—

శ్రీ రామకృష్ణ విద్యాలయము,
మహబూబాబాదు—506101.
వరంగల్లు జిల్లా.

# ప్రయోజనం

కన్నడ మూలం: డా॥ కె. వి. పుట్టప్ప          తెలుగు మూలం: శంకరగంటి రంగాచార్యులు

ముంత ప్రశ్నించింది బానను :

"ఓ నీళ్ళు నిండిన బానా,
బయలుదేరావా సహారా ఎడారికి?"

పెద్ద బాన పలికింది పొంగి :

"ఔను, దాన్ని సస్యశ్యామలం చేయటానికి!"

చిట్టిముంత తన సందేహాన్ని
వెలిబుచ్చిందిరా :

"చెబుతారు,
దాని విస్తీర్ణం వేలాది చదరపు మైళ్ళట;
అట వానలేనేలేదు; వట్టిమండుటెండలట;
పచ్చగడ్డి పోచలేని వట్టి ఎడారి బయలట!
ఒకటికాదు, రెండుకాదు,
వందసాగరాలు దాని మీద ఉప్పొంగినా,
బిందువు కూడా నిలువక ఇంకి పోయే బడబాగ్ని దానిదట!
నీవు
ఒకటి రెండు కడవల నీళ్ళు నిండిన బానవు,
నాకన్న ఎంతపెద్ద దానివైనా
క్షమించు,
కోటియోజనాల విశాలమైన ఎడారిని
చేయగలవా సస్యశ్యామలంగా?
మేటికి ఆ వ్యర్థ సాహసాన్ని వదలి
మన ఈ చిన్న తోటలోనే నిలిచి

చిన్న చిన్న ఈ చెట్లకు నీళ్ళుపోస్తే
చిద్విలాసంగా ఇది ఫలిస్తాయిగా, సోదరా?''

ముంత మాటలను విని,
మొద్దుబాన రబ్బరు బంతిలా ఉబ్బి,
నవ్వింది తిరస్కారంగా :

''పిచ్చిదానా,
ఈ కుగ్రామంలో నా సాహసాన్ని తిలకిచే వాళ్ళెవరు ?
దాన్ని చూడటానికి గుమిగూడటానికైనా నలుగురున్నారా
ఇక్కడ?

ఇక్కడున్న నీ పత్రికో, మూడు పైసలది!
దానికుండేది ఒకే ఒకపూట!
చందా దారులో!
లెక్కిస్తే వేళ్ళు మిగుల్తాయి!
సహారాకు సలిలసేనార్థం నేను పోతే
సమాచారం వ్యాపిస్తుంది దేశ దేశాల్లో!
వేర్వేరు బాషల పెద్ద పెద్ద పత్రికల్లో,
(నీ మూడు పైసల ఒకే ఒక పూట పత్రికలు కావు!)
పుట పుటలోనూ నిండుతాయి నా బొమ్మలు!
మహాకవులు నా కీర్తిగానం చేస్తారు!
నన్ను భగీరథునికి పోల్చి వ్రాస్తారు!''—
''అయితే, ఏం ప్రయోజనం, అగ్రజా?
నీ రెండు కడవల నీళ్ళతో సస్యశ్యామలమవుతుందా సహారా?''
''అది సస్యశ్యామల మయితే ఎంత? కాకుంటే ఎంత?
నా పేరు కొస్తుంది లోకప్రసిద్ధి!
దానికన్నా ఏమిటయ్యా—'ప్రయోజనం'?''

హెడ్‌మాస్టర్
రాళ్ళహాల్లి
జి॥ అనంతపురం

# కళ్ళు

—భగ్వాన్

నిజాల్ని చూడాల్సి వస్తుందని
నిరంతరం
తనివితీరా నా కళ్ళు
కలల్ని మేస్తూ ఉంటాయి...
నిజాల్ని చూడాలంటే మాటలా?
ధైర్యం ఉండొద్దూ
గుండెనిబ్బరం కావొద్దూ....
ఆకలితో అలమటించే వాడికి
టెలివిజన్ రంగుల దృశ్యాల్ని చూపించి
ఓదార్చబూనడం ఎంత ఘోరం
అన్యాయం జరిగిందని ఆక్రోశించేవాడికి
అందమైన అమ్మాయిల బొమ్మల్నిచ్చి
ఊరోక్కమనడం ఎంత నేరం
ఇదుగో....
ఇలాంటి నిజాల్ని చూడాల్సి వస్తుందనే
నా కళ్ళు కలల్ని మేస్తూ ఉంటాయి
రాత్రివేళ
నీలగగన ఖజానానుండి
చీకటిని కడుపునిండా త్రాగుతూ ఉంటాయి
నా కళ్ళు
వెన్నెలని శరీరం నిండా
పులుముకుంటూ ఉంటాయి నా కళ్ళు
చుక్కల్ని లెక్కబెడుతూ
కాలక్షేపం చేస్తుంటాయి నా కళ్ళు.
సూర్యుడ్ని చూడాలంటేనే భయం
వెలుగులో వేడివేడి నిజాల్ని చూడాలంటేనే
భయం
అందుకే నా కళ్లు
నిజాల్ని చూడాల్సి వచ్చినప్పుడు
అల్లల్లా మూసుకుపోతూ ఉంటాయి.
పచ్చని పంటచేలు గాలికి
సరదాగా తలలూపే సుందరదృశ్యానికి
పరవశించిపోతూ ఉంటాయి నా కళ్ళు.
అన్నదాతకు అన్నం పరువన్న సత్యాల్ని
వీక్షించాలంటేనే
చటుక్కున మూసుకుపోతాయి.
నల్లని మేఘం కురిపించే
చల్లని జల్లులకు తడిసి మత్తెక్కిపోతుంటాయి
నా కళ్ళు
ఆ జల్లులకు కూలిపోయి కరిగిపోయే
పూరిపాకల్ని చూడాలంటేనే చిక్కు నా
కళ్ళకు.
తోటలోని గులాబీ పువ్వుల్ని,
క్రోటన్ మొక్కల్ని
ఆనందంగా స్పృశిస్తూ ఉండాయి నా కళ్లు

మొక్కల్ని పెంచుతున్న చేతుల కంటిన
మట్టిని చూడాలంటేనే ముడుచుకుపోతాయి
మౌనంగా...
రంగురంగుల సీతాకోకచిలుకల రెక్కలవెంట
ఎగిరిపోతాయి నా కళ్ళు
రంగు వెలసిన మనసులు రాల్చే
కన్నీటి రక్తపు చుక్కల్ని చూడాలంటే
అలసటతో కూరుకుపోతాయి
ప్రియురాలి అందాల్ని కౌగిలించుకుంటూ
కలల్ని వెలిగించుకుంటాయి నా కళ్ళు
యవ్వనం మూడు నాళ్ళ ముచ్చటని జ్ఞప్తికి
వచ్చేసరికి
ముడివేసుకుపోతాయి నాకను రెప్పలు.
కలల్ని మేస్తూ శిలలైన నా కళ్ళను
చైతన్యాగ్నితో కరిగిస్తున్నాను...
నిజం నిప్పులతో నా కళ్ళను కుతకుత ఉడి
కిస్తున్నాను

ఇప్పుడు...
నా రెండు కళ్ళూ రెండు అగ్నిగుండాలు
నిజాల్ని నిర్భయంగా చూడగలిగే చైతన్య
దీపాలు
అన్యాయాల్ని, అక్రమాల్ని ఎదిరించగలిగే
ఎర్ర బావుటాలు.

పంజా వేమవరం
భీమవరం తా॥
534247

# దేవుడు అంటే ? !

—కె. స్వర్ణలత

అస్తిలో తార్కాణం అసురుడు.
నాస్తికి నిదర్శనం మానవుడు.
మానవుడే మాధవుడు!
కానపుడే దానవుడు
మానవ ప్రభవకారణం దేవుడైతే,
మానవ ప్రచుర ప్రభాస ప్రభావ కారణం జీవుడు.
దేవుడు నిల్పిన జీవుడు గొప్పా?
జీవుడు నల్పిన దేవుడు గొప్పా?
వంచన లేనివాడు దేవుడు.
పంచ పాండవులలో దేవుడు కాడా సహదేవుడు?
అంతులేనివాడు దేవుడు.
అంతులేని వింత తపస్వి కాడా వసిష్ట భూదేవుడు?
ఓర్పుకలవాడు దేవుడు.
నేర్పరియై పని సాధించడా వసుదేవుడు?
భక్తుల బ్రోచువాడు వాడు దేవుడు.
భుక్తిలోపించి అనురక్తితో ఆర్తిని రక్షింపడా రంతిదేవుడు?
త్రి భువన సాహసి దేవుడు.
ప్రభు భక్తికి బలికాడా (కురు) గురుదేవుడు?

దొమ్మర నంద్యాల,
జమ్మల మడుగు తా॥

# జీవితమంటే....!!

—సి. కామేశ్వరరావు

జీవితం.
వైకుంఠ పాళీ అని
పరమ పద సోపానమేక్కే లోపల
కష్టాల విషనాగులు మింగేస్తాయని
కంటి నీరు పెట్టుకుంటావు...
జీవితం-
గిర గిర తిరిగే బొంగరమని
తిరిగి తిరిగి అలసి సొలసి
ఎప్పుడో ఎక్కడో ఆగిపోతుంది
చప్పబడి పోతావు...
జీవితం-
ఒక నాటక రంగమని
ఆ నాటకరంగంలో
నీ పాత్ర ఎలా ముగిసి పోతుందోనని
నీళ్లు నమిలి నీరసించి పోతావు...
జీవితం-
లిప్త పాటని
బుద్బుదంలా విరిసి
మాయమౌతుందని
గాయమైన మనసుతో దిగాలు పడిపోతావు....
కాని...
జీవితమంటే-
అనిర్వచనీయమైన
మేధా సంపత్తి వలయమని
మానవతా విలువల
మకరంద బిందు సంభరితమని
అనన్య సామాన్య సాహసోపేత
చైతన్య నిలయమని
సదా సత్యాన్వేషణా
దీక్షాదక్ష కంకణమని
తెలుసుకోలేకపోతున్నావు-
ఎంతకాలం జీవించామన్నది
జీవితానికి కొలతబద్ద కాదు
ఎంతమంది బ్రతుకుల్లో
వెలుగు నింపామన్నది
జీవిత పరమావధి !
కన్నీరు కాల్చే గుండెల్ని
కారుణ్యంతో పలుకరించినపుడు;
నీ జీవితం చరితార్థకమౌతుంది
ఆవేదన నిండిన మనస్సుల్లో
అనురాగామృతం చిలికినపుడు;
నీ జీవితం చిగురిస్తుంది.
మానవీయ అక్షౌ్యాలతో
ముందడుగు వేసినపుడు
ఈ విశ్వజనానికి నీవు
ఆప్తుడవు...! పరమాత్ముడవు...!
మర్త్యుడవైనా
మహనీయుడవు... మాననీయుడవు...!!

తిలక్‌నగర్ వీధి,
కాశీబుగ్గ-532222
శ్రీకాకుళం జిల్లా

# బ్రతుకు 'గడియారాలు'

—కనపర్తి రామచంద్రాచార్యులు

ఈ సమాజంలో—
'టైంపాస్' జీవితాలు కొన్ని,
'టైం పీస్' జీవితాలు మరికొన్ని;
ఎంతకూ వదలని
మెదలని జీవితాలు
ఆగిన గడియారాల్లాంటివైతే—
కాలంతో నిమిత్తం లేకుండా
ఇతర అవసరాలతో
అవసరం లేకుండా,
మోసగిస్తూ ముందుకురికే జీవితాలు
ఇంకొన్ని!
సమ(యానుకూల)ంగా
తమ- 'వృత్త-పరిధి' లోనే తిరుగుతూ-
అనుభవాల అలారంతో సాగే
టైం-'టేబుల్ గడియారాల' కేం గాని-
ఇంతకీఉ ఆ'కీ' యిచ్చే 'వాని'పని లేకుండానే
'ఆటోమేటిక్' గా సాగిపోయే
జీవితాలూ ఉన్నాయి!!
'స్టైల్'గా సాగే వీటి బ్రతుకు 'డైల్'లో
తేదీలు, వారాలు వాటంతటవే సాగిపోతుం
టాయి——
ఇన్నిరకాల గడియారాలు
ఈ జీవితం 'వర్క్-షాప్' లో పడిఉన్నాయి
పరిశీలిస్తే- జీవితాలకూ గడియారాలకూ
ఎన్నో పోలికలు కనిపిస్తాయి!
ఊపిరి సలువుకోకుండా
చుట్టూ తిరుగుతూ పెద్దముండ్లను
ప్రతి నిమిష నిముషమూ కొలిచే
చిన్నముండ్లు!!
ఏం చేస్తాయి? వాటి అదృష్టపు
'బాల్ కమాన్' అలాంటిది:
'చెయిన్' లేకుండా- కట్టుబాట్ల
'బెల్టు' తోనే సాగుతూ-
రోల్డుగోల్డు'తో రోలింగవుతూ-
గోడ గడియారంల్లో
గుండె పెండ్యూలం ఆడేవరకూ
నడుస్తుంటాయి!
కాని- హెచ్చు తగ్గులు మరచి
గడియారం ముండ్లలా- మనిషిఒక్కసారైనా
చేతులు కలిపి, సమభావాన్ని పంచుకోడు
గదా!
అందుకే-
'చెడిన', 'వెనుకబడిన'
ఈ బ్రతుకు— 'గడియారాల'
రిపేరర్ ఎవ్వడో కాని
ఎక్కడున్నాడో కన్పించడం లేదు—!

ఇంటి నం. 7-3-62. గంజు రోడ్
సిద్ధిపేట-502 103

# ఎక్కడున్నావు మానవతా?

—చాగంరెడ్డి నరసింహారెడ్డి

ఎక్కడున్నావు మానవతా?
ఎక్కడున్నావు?
ఇరుల కౌగిట్లో కీళ్లు సడలి
కటకటబడుతున్నావా?
చదపట్టిన చరిత్ర వుటల్లో
పచ్చి గాయాలతో సత్తువ లేక మూల్గుతున్నావా?
సోక్రటీసు అందుకున్న విషపాత్రికతో
విశృంఖల నృత్యం చేసింది అసురకృత్యం.
ఏసుకే శిలువవేసి
ఎదురేది తనకని విర్రవీగింది ముష్కరత్వం.
మహాత్మునే గుండె చీల్చి
వికటంగా హసించింది దానవత్వం.
ఎక్కడున్నావు మానవతా?
ఎక్కడున్నావు?
తరతరాలుగా యుగయుగాలుగా
నీ అంగాంగం ఖండించి హింసించినవారే.
ఏదీ బోధిసత్త్వుని అహింస
ఎక్కడా మచ్చుకైనా కానరాదు.
'అహింసో పరమో ధర్మః'
అని నమ్మినవారి గుండెలను
హింసా చక్రం కోసేస్తుంది.
'ధర్మో రక్షతి రక్షితః' అన్నారానాడు
ఎందరో ధర్మమూర్తులు
నిన్ను నమ్ముకొని అసువులు కోల్పోయారు
ఎక్కడున్నావు మానవతా?
ఎక్కడున్నావు?
ఏదీ విక్రమించే అసురప్రవృత్తిని
దహించే నీ విషమాంబకం.
ఏదీ కరాళ కంకాళనృత్యం చేసే దుర్మార్గవర్తనాన్ని
అణచే నీ చండతర నిర్ఘాత గదాదండు.

# 'కాంతం' గారి మునిమాణిక్యం
## (సాహిత్య వ్యాసం)

—మంతెన సూర్యనారాయణరావు

కాంతాని కంటే ముందు 'కాంతం' అనే అపురూప కథాసుందరిని సృష్టించిన వారెవరు? అన్న ప్రశ్న మరి కొంచెం ముందు వేసుకుంటే-తెలుగు హాస్యానికి ఒక ప్రత్యేకతను, అందులోనూ కథకు ఒక ప్రత్యేకతను కలిగించిన వారు ముని మాణిక్యం నరసింహారావు గారు. వీరిని 'కాంతం' గారి ముని మాణిక్యం అనడానికి కారణం ఏమంటే కాంత కథల ద్వారా తన యొక్క పేరును సుస్థిరం చేసుకోవడం జరిగింది కాబట్టి.

ఈయన చరిత్ర బోధించే మాష్టారైనా ఆయనను చూసి ముసి ముసి నవ్వులు నవ్వని తెలుగు వారుండే వారు కారు ఆ రోజుల్లో. వీరి అన్ని రచనల్లోను సుని శితమైన హాస్యం దోబూచులాడుతూనే వుంటుంది. గార్హస్థ్య జీవితంలోగల సౌందర్యాన్ని మనోహరంగా చిత్రించిన ప్రతిభాశాలి. ఇంతటి ప్రతిభావంతంగా వ్రాయగలిగే వారు మరొకరులేరనే చెప్పాలి. అయితే ముని మాణిక్యం వారు మెచ్చిన హాస్య రచయిత మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. అందుకే ఆయన రచించిన 'నేను-మాఆవిడ' అన్నకథ విన్నాక ఆనందంతో పొంగిపోయారు. ముని మాణిక్యం.

అనంతర కాలంలో నరసింహారావుగారు కూడా విజృంభించి చక్కని చిక్కని హాస్యరసం అందివ్వ గలిగిన రచనలు ఎన్నో చేసారు మచ్చుకు ఇంటావిడతో పోట్లాట, ప్రయాణకలహం, అప్పులు చేయడం. తీర్పడం, కాంతమ్మగారి సీతయ్య, గాలిపిల్లలు, వితాండవాదాలు, అన్నయ్యమంత్రి, మాటనేర్పరితనం, గాడిదల తిరుగుబాటు-లాంటివి. అంతే కాకుండా "మన హాస్యం అనే పేరుతో హాస్యరసానికి రూపురేఖలు కలిగిస్తూ లక్షణ గ్రంథాన్ని వ్రాసేటంత ఎత్తుకు ఎదిగి కూర్చున్నారు. ఆ పుస్తకం ప్రతి గ్రంథాలయంలో ఉండితీరాల్సిందే!

వీరి రచనలు ఎన్నో భారతీయ భాషల్లోకి అనువదించబడే అదృష్టానికి నోచుకొన్నాయి. నండూరి సుబ్బారావుగారి 'ఎంకిపాటలలో' 'ఎంకి' ఎటువంటి నాయికో, ముని మాణిక్య నరసింహారావుగారి 'కాంతం' కూడా తాదృశమైనదే' ఇంతకీ అసలెవరీ కాంతం? ముని మాణిక్యం నరసింహారావు గారి భార్యా? లేక ఆమె కేవలము కల్పిత వ్యక్తా? అంతే రెండూ కాదు. అసలు కథ మరోటుంది. కాంతం అనే పేరు తనకు ఎట్లాతోచిందో చెబుతూ ఆయన నాభార్య పేరు కాంతం కాదు. తనకు స్నేహితుడొకడుండేవాడని అతగాడి సోదరి పేరు కాంతమట. ఎందుకనో ఆపేరు వినడంతోటే నరసింహారావుగారికి! అమితమైన మక్కువ ఆపేరు మీద కలిగిందంటారాయన.

ఈ విషయంలో సుప్రసిద్ధులైన రచయితలలో ఒక్కొక్కరికి వారి రచనల్లో ఒక్కొక్క పాత్ర మీద ఆత్మీయతా ముద్రపడుతుంది అనడం అక్షరాక్షర సత్యం. ముఖ్యంగా కాంతం కథలు అనే బృహత్ ప్రబంధానికి నాయిక కాంతమే! ఆమె శృంగార నాయికలు ఎనమండుగురిలో ఏకోవకన్నా చెందుతుందా

అంటే చెందదు. మరి ఏకోవకు చెందుతుందంటే మామూలు మధ్య తరగతి గృహస్థుని ఇల్లాలు, పై పెచ్చు పిల్లలుగల తల్లి. ఈ పాత్ర ద్వారా ముని మాణిక్యం నరసింహారావుగారు. సంసారంలో ఆడవాళ్ళు భర్తలను చీరలు కొనమని, సొమ్ములు చేయించమని వేధించడం, భార్యా భర్తల మధ్య అంతఃకలహాలు, చిరుబురు లాటలు, కోపతాపాలు, విరహాలు, సరస సల్లాపాలు, ముద్దు-ముచ్చట్లు, దెప్పుళ్ళు, అనుమానాలూ, సాధింపులూ-అన్నీ చక్కగా కళ్ళకు కట్టేటట్లుగా ఆయన 'కాంతం కథం' ద్వారా ప్రదర్శింప జేస్తారు.

నరసింహారావుగారు చింతాదీక్షితులుగారు రచించిన "ముద్దు" కథ చదివాక భార్యా భర్తల సంభాషణ మనోహరంగా చిత్రించారు అది తాను చదివాక తనకి సంసారిక జీవితంపై అనురక్తి ఏర్పడిందని చెప్పారు. ఆ అనుభూతి ఎంత మహత్తరమైనదో ఏమోగాని తన హృదయానికి చక్కిలిగిలి పెట్టినదంటారాయన.

ఆమధురాను భూతులు నెమరు వేసుకుంటూ వున్న శుభ సమయంలో ముని మాణిక్యం వారికి పెళ్ళికావడం, భార్యరావడం జరిగాయి. ఆవిడ పల్లెటూరి పిల్లకావడం, పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలేనిది కావడం, ఆంగ్లభాషతో పరిచయంలేని దవడం, జాను తెనుగు మాట్లాడే జాణకావడం ఆయనను మరింత భావుకుణ్ణి చేసాయి. మధ్య మధ్య ఆమె కూడా చమత్కారాలు చేస్తూ ఆయనను మంత్ర ముగ్ధుణ్ణి చేసేది. అప్పటికే కొద్దిగా ప్రబంధాలు చదివి అందులోని వర్ణనలు జీర్ణించుకున్నారేగాని, ఎందుకనో వాటిలోగల శృంగారము అసహజము, కృత్రిమము, కృతక ము-అయిన సన్నివేశాల మీద మోజు వదులుకున్నారు. గృహస్థ జీవితంలో కావలసిన వర్ణనలు ఎన్నుకుని వాటిని తన రచనల ద్వారా వచన ప్రబంధాలు సృష్టించగలిగారు.

ఒకచోట ఆయన అంటారు. పెళ్ళయిన తొలి నాళ్ళలో తన భార్య మాటలూ, శృంగార చేష్టలూ కథలు వ్రాయడానికి ఆధారభూతాలయ్యారు. "అన్న మాట వాస్తవమేనంటూ, తర్వాత కాలంలో కాంతం ఆయన మనస్సులో నిండిపోయింది. దినదినాభివృద్ధి చెందుతున్న కాంతానికి తన భార్య ఎప్పటికప్పుడు ప్రతిబింబంగా నిలిచి నట్లుందని ఆయన అనే వారు. కాంతం కథల్లో వుండే మరోవిశేషమేమంటే ఆమఅన్ని చోట్లా ఒక్క స్వాధీనపతికగా వుండక భిన్న భిన్న సందర్భాల్లో సందర్భానుసారంగా వాసవసజ్జికగానో, విరహోత్కంఠితగానో, ఖండితగానో, కలహాం తరిత గానో, విప్రలబ్ధగానో, ప్రోషిత భర్తృకగానో-రూపాంతరాలు చెందుతూ వుంటుంది.

పిల్లలకు తల్లిగా, భర్తకు ఆదర్శపత్నిగా-ఆమె జీవితం అనేక గిరికీలు కొడుతూ పయనిస్తుంది. ఆమెలో వృద్ధాప్య లక్షణాలు వచ్చినా కథ నడిపించ గలిగిన శక్తి మాత్రం కుంటుపడదు. ఇటువంటి అద్భుత పాత్ర సృష్టించి ఆంధ్రుల హృదయాలలో చెరగని ముద్రవేయించ గలిగిన ముని మాణక్యంవారు అమరులైనా "కాంతం కథలు" మనకందించటంచేత ఆయన ఇంకా సాహితీ లోకంలో చిరంజీవిగానే వెలుగొందుతున్నారు. "హాస్యబ్రహ్మ" భమిడి పాటి కామేశ్వరరావుగారి దొక విలక్షణమైన శైలైతే, నరసింహారావుగారిది సంసార పక్షమైన ప్రత్యేక శైలి అనడం సబబుగా వుంటుంది

"శుభం భూయాత్"

లెక్చరర్,
ఎస్.కె.బి.ఆర్. కాలేజి
అమలాపురం-533208

# తెలుగు సిగపూవు తురిమిన అన్యభాషీయుడు మోరియా

-సి. హెచ్. వెంకటేశ్వరు

'చర్ల'లో, ఒక సాహిత్య సంస్థ ఉంది. దాని పేరు "గౌతమీ నవ్య సాహితి". దాని వ్యవస్థాపకులలో కళాతపస్వి శ్రీ చింతల-చెలువు-వెంకట కృష్ణారావు గారొకరు. మా వోంట్ల హృదయాలలో మిణుకు మిణుకు మంటున్న రచనా శక్తికి ఉద్దీపకులు వారు. వారి యొక్క దయ వలన ప్రముఖ ఉర్దూ కవివర్యులు శ్రీయుతులు హీరాలాల్ మోరియా గారి పరిచయ భాగ్యం లభించింది

శ్రీ మోరియా గారిని మొదటిసారిగా కలుసుకున్నపుడు ఆశ్చర్యం వేసింది. వర్క్‌షాప్‌లో మెకానిక్‌లా, మూడు గదుల పుస్తకాల మధ్యన, ఏదో వ్రాసుకుంటూ వుంటే, ఇతడు మహర్షి కాడు కదా! అనిపించింది. పూజ్యులు 'ఆరుద్రను' చూచినపుడు కూడా అలాగే అనిపించింది,

మొదటి పరిచయంలోనే, నా యెడల వారు చూపిన ఆదరణ, ప్రోత్సాహం మరువలేనిది. ప్రముఖ స్వాతంత్ర యోధుడు, స్వర్గీయ, "జమలాపురం కేశవరావు"గారికి కుడి భుజమై, నిజాం నవాబును గడగడ లాడించిన వీరుడు, మహాకవి "దాశరథి" వంటి ప్రముఖులతో పని చేసిన ప్రజాకవి, "విప్లవం, వర్ధిల్లాలి" అనే నినాదాలతో నిజామాబాదు జైలు గోడలను ప్రతిధ్వనింప చేసి సత్యాగ్రహుల నందరినీ ఒక్క త్రాటిపై నడిపిన విప్లవకారుడు శ్రీ మోరియా. మాతృభాష, 'ఉర్దూ' అయినా, 'రచయితల సంఘాన్ని' నిర్మించి, తెలుగు సాహిత్య రంగాన్ని పరిపుష్టం చేసిన సాహితీ జిజ్ఞాసువు.

మొదటిగా, "మహాపథం" తీసుకుంటాను. "సర్దార్ జమలాపురం కేశవరావు"గారి మహోన్నత వ్యక్తిత్వానికి కరదీపిక ఈ కావ్యం. కవిగారి మాటల్లో—

"సర్దార్జీ పవిత్ర జీవితం ఆశయాలే ఈ కావ్యాత్మ. తేజోమూర్తి అయిన ఆ మహా మహునితో, నేను చిర కాలం సాహచర్యం నెరపి, జీర్ణించుకున్న భావా దేశ సముదాయమే, ఈనాటి వరకూ నన్ను ఉత్తేజపరుస్తున్నది."

ఇందులో కవికి కావ్య వస్తువు యందు గల అభినివేశం విశదమైంది. ఇక అనువాద విషయంలో, ఉభయ భాషా ప్రవీణులైన శ్రీ దాశరథిగారు స్వయంగా ఈ తెలుగు అనువాదానికి 'పచ్చజండా' చూపించారు.

ముఖ్యంగా, ఈ కావ్యాన్ని 'మూడు భాగాలు'గా విభజనం చేయవచ్చు. మొదటిది, శ్రీ కేశవరావుగారి జీవిత చిత్రణ; రెండవది, వారి అనుయాయుడుగా కవి పొందిన సంక్షోభం; చివరిది, స్వర్గీయ సర్దార్‌కు, ప్రస్తుత పరిస్థితుల మీద కవి సమర్పించిన నివేదిక.

మొదటి భాగాన్ని కాస్త సంక్షిప్తం చేస్తే—

ఈ సంధ్యా సమయానికి నేత ఒకడు కావాలి;
ఈ చీకట్లను పారద్రోలేందుకు,
రాబోయే తరానికి మార్గదర్శకత్వం వహించేందుకు
దాస్య శృంఖలాలను ఛేదించేందుకు.

ఆకాశం నుండి నక్షత్రం హంస అవనికి చేరింది.
కేశవుని జన్మదినం, తెలంగాణా పుణ్యదినం
...

స్వాతంత్ర్య పిపాసాగ్ని
కార్చిచ్చులా వ్యాపించింది.

పేదల పగిలిన గుండెల
గాయాలకు కట్టు కట్టడం, సేద దీర్చడం; ఆయన
తలపెట్టిన మహోద్యమం

ఇవ్వాళ మన మధ్య
ఆ మహా మనిషి లేడు "

ఉత్తమ సంప్రదాయ కావ్యాలలోలాగా, ఉత్తమ నాయకుడు, అతడి యొక్క పుట్టుక, అంతకు ముందున్న సమాజస్థితి, ఆ సమాజములో ఎవరో ఒక మహా పురుషుడు ఉద్భవించాలనే ఆకాంక్ష, నాయక జననం తరువాత అతని యొక్క కృషి, ఫలితము; వగైరాలు చక్కగా కావ్యీకరింపబడ్డాయి. "ప్రచండ వేగంతో గుండెలదరగొడుతూ, గాలి తన యొక్క గమనాన్ని మారుస్తోంది". అనే ప్రారంభం, చక్కని అర్థవంతమైన ప్రారంభం. కవి యొక్క ప్రతిభకు పై మెట్టు. ఆకాశం నుండి నక్షత్ర హంస అవనికి చేరింది; అంటే అలా ఎందుకన్నారా! అని ఆలోచిస్తూపోతే, చివరకు దొరికింది కారణం. నక్షత్రం లాగానే, (కావ్య పరిభాషలో) నాయకుని యొక్క జీవితం దేదీప్యమానంగా విశాలవిశ్వంలోకి జారి పోయింది.

సర్దార్ జమాపురం నిర్మాణంలో ఆధారం కోల్పోయిన పక్షివలె, కవి హృదయం విలపించింది. ప్రపంచమంతా శూన్యమై పోయింది. క్షణ కాలం బేలతనం ఆవహించింది.

ఇక్కడ స్మృతి కావ్యలక్షణం ప్రస్ఫుటం అయింది. ఎడబాటులో కవి తన్ను తాను మరచిపోతాడు. ఆ నిర్వేదం నుండి కోలుకునే సరికి, 'మోరియా'గారిలో కార్యకర్త నిష్క్రమించారు. కవి మిగిలాడు. ఏ లక్ష్యంతో, తన మిత్రుడు ఉద్యమం నిర్వహించాడో, అది నెరవేరలేదు. ఫలితం ఏడారిలో కాచిన వెన్నెల అవుతోంది.

"స్వతంత్రం సిద్ధించినా, పెను చీకట్లు తొలగ లేదంటాడు అందుకే."

కుహనా రాజకీయ వేత్తలు
నీ కృషిని విస్మరించారు.

జిత్తుల మారి నక్కలకు
పెంట మీద కుక్కలకు-దేశం నిలయమైపోయింది.

"ప్రతి చోటా పతనం
ప్రతి రంగంలో కుట

ఇది ప్రజాస్వామ్యమా!? అని అనుమానం వచ్చే పరిస్థితులు చుట్టుముడుతున్నాయి. కవి ఈ విషయం స్పష్టం చేశాడు.

"ప్రస్తుత ప్రజాస్వామ్యం కన్నా
ఏడారి నయం
బ్రతుకు భయం."

కవితలో ప్రతి చోట, సామాన్య వ్యక్తి ఎదుర్కొంటున్న పరిస్థితులు స్పష్టం చేయబడ్డాయి. ఉదాహరణకు కొన్ని:-

"ఆఫీసులు—అధికారులు—నేతలు
అంతా కంకాళ భాషలో
కొక్కిరిస్తున్నారు.

రాకాసుల్లాంటి రాజకీయ వేత్తలు
రాజ్యం చేస్తున్నారు.

.... ... ... ... ...

మోసం పేరిక్కడ రాజకియం

'రాజకీయం' అంటే, అర్థం మర్చిపోయే పరిస్థితి ఏర్పడింది. ఎంత మంది గుండాలను ప్రోగు చేసి, ఎంత మందిని మోసం, దౌర్జన్యాలతో లోంగతీసుకో గలిగితే, వాడు అంత గొప్ప రాజకీయ నాయకుడుగా పరిగణింప బడుతున్నాడు. ఆ ప్రబుద్ధుడే, రేపు ప్రధాన మంత్రి అయినా, మనం ఆశ్చర్య పోనక్కర్లేదు. ఇటువంటి ప్రభుత్వంలో, "ప్రగతి పథం" అనే మాట పొల్లుగాక ఏం చేస్తుంది?

అప్పుడు పరాయివాడు పీడించాడు. ఇపుడు మన వాళ్ళు పీడించుకు తింటున్నారు.

అయితే, కవితో ఆటువంటి నాయకుడు పునరుద్భవిస్తాడనీ, సమాజం మళ్ళీ చక్కబడే రోజు వస్తుందనీ ఆశవున్నది. అందుకే—

"నేను స్వాతంత్ర్య పిపాసిని
నవ్యత్వం వాంఛిస్తాను
సమ సమాజాన్ని కోరతాను
హృదిలో, మదిలో
నిస్వార్థతను కోరతాను.

నిర్ధనుని పోరాటం
నింగీ నేలను నిండుతుంది".

ఉత్తమైన ఆశయాలు, లక్ష్యం మీద ప్రగాఢ విశ్వాసం ఉత్తమ నాయక లక్షణాలు ఆటువంటి నాయకుడు తిరిగి తనకు లభిస్తాడనే ఆశా మాత్రపు భావమే కవిలో తిరిగి మరల కర్తవ్యోన్ముఖతను మేల్కొల్పింది అది, అతనిలో ఉత్తమ సంకల్పానికి దారి తీసింది.

"నడవాలిక
నడవాలిక
నడుము వాల్చకూడదింక
విశ్రమించకూడదింక
ఆలస్యం తగదిప్పుడు
అవులింతలు రాకూడదు
అవనీ ఆకాశం
అనంత సాగర గర్భం
మన గర్జనతో
కంపించాలి.
భూమి ప్రకంపించాలి
అగ్ని పర్వతాలు
బ్రద్దలవ్వాలి."

ఇది కదనం కదలండి :

పుస్తకం తెరవగానే ముందు కనిపించే కవితా "చందా" ప్రస్తుత వ్యవస్థా స్వరూపాన్ని ప్రతిబింబిస్తుంది. యీ కవిత ధన, మాన, ప్రాణాలు లెక్క చేయకుండా స్వేచ్ఛా కదనంలో కాలిడిన అసలైన దేశ భక్తులను నిలువ నీడ కూడా కూల గొడుతున్న ప్రస్తుత భారత స్వాతంత్ర్య వ్యవస్థ మీద స్వయంగా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న ఒక విప్లవ మూర్తిగా కథనాన్ని ప్రకటించారు మోరియా. ఇంగ్లీషు ప్రభువుల తొత్తులు, నైజాం నవాబు పెంపుడు కుక్కలు, వల్లబజారు నిర్వాహకులు, కంట్రాక్టర్లు, అంతా ఖద్దరు ధారులైనారనటం నిజం.

"నా దేశం" కవితలో—

"విద్యకూ, వినయానికీ
విజ్ఞానానికి, స్పష్టతకూ
సౌజన్యానికీ, దయకూ
ధర్మానికీ పెట్టింది పేరు నాదేశం
నా దేశపు కీర్తి ఢంకా
ప్రపంచపు నలుమూలలా మార్మోగింది".

అనే మాటలు కవి గుండెల్లో నిండిన జాతీయతను స్పష్టం చేస్తున్నాయి. స్వాతంత్ర్యా నంతర కవుల్లో, జాతీయ భావం తక్కువగా వినిపిస్తున్నది.

"బడుగు బక్క దేహాలన్నీ
భయంకరంగా కదిలిన నాడు
బ్రహ్మాండ భాండం బ్రద్దలవ్వక మానదు.
ఆ శుభోదయాన!
నేను,
ఆమందానంద భరితుడనై
నా బక్క జనంతో
నా బడుగు జనంతో
నృత్యం చేస్తాను
గీతాలను పాడుతాను".

పీడిత ప్రజ వెనుక కవి నిలిచాడు. వెన్నుపాములా, వారిలో అంతర్గతమై పయనించాడు. "దాశరథి" వంటి మహాకవుల సాహచర్యం ఈ కవిలో సంపూర్ణంగా ఫలించింది. ఇతడే తెలుగు కవి అయినట్లయితే, ఎంతో రాణించి వుండేవాడని నా యొక్క విశ్వాసం.

"గంగ" కవితలో

కార్మిక నాయకులమని చెప్పుకునేవారి యొక్క గుట్టుబైట పెడతాడు.

"సామాన్య కార్మికుడు
కార్మిక సంఘాలకు
క్రమం తప్పకుండా చందా చెల్లిస్తాడు.
కార్మిక వర్గ శ్రేయస్సు కొరకు
కంకణధారుల మైనామనే
మోసపు రాజకీయాలను నమ్ముతాడు".

ప్రభుత్వ ధనం అంటే పన్నులు ఎక్కువగా ధనవంతులు యిచ్చేవే గాబట్టి, ధనవంతుల ధనంతో కడుపులు పెంచే కొన్ని రాజకీయ పక్ష నాయకుల కంటే పేదవారు చెమటోడ్చి, సంపాదించి, బంగారు భవిష్యత్తు కోసం కలలు కంటూ, కట్టే చందా డబ్బులతో మేడలు కట్టుకునే కొన్ని రాజకీయ పక్షాల నాయకులు క్షమించరాని రాక్షసులు కదూ!

అలాగే, అభ్యుదయ గాములమని తిరిగే కుహనా అభ్యుదయవాదుల గుట్టు "మార్పు" బయట పెడతుంది.

ఒకవైపు పాలక పక్ష నాయకులు, మరొక వైపు ప్రతి పక్ష నాయకులు; అందరూ ప్రజలను పీక్కుతినే వాళ్ళే! ఒకరు అధికారంలో అయితే, రెండవ వారు ఆశలు రంగులొల్కిల్పి, లేదా దౌర్జన్యం ప్రకటించి; ఇక సామాన్యుడి గతి ఏమిటి?

ఇలా, ప్రతి 'బండిక'లోనూ' స్వాతంత్ర్యానికి ముందున్న నాయకుల ఆశయాలకు, తరువాత కనిపిస్తున్న స్వార్థ పిశాచపు విశృంఖల స్వైర విహారాలకు మధ్య వున్న వ్యత్యాసం సువ్యక్తమౌతోంది.

మిన్నేటి పొంగులు

ఇది "దాశరథి" స్వయంగా తెలుగు చేసిన కవిత; అందుకనే కవితలో ఎక్కువగా దాశరథి తానుగా కనిపిస్తాడు. వస్తువులో మాత్రం కవివి చూడగలం అయితే, మూలను వాదక ర్తలిద్దరూ సమవయస్కులు. కలిసి పని చేసిన ఉద్యమ కారులు కాబట్టి, వస్తువులో కూడా యిద్దరి మధ్య అంతగా భేదం లేదు "పేదల బ్రతుకులు," ఇందులోని వస్తువు.

"పేదసాదల బీదవారల
నిర్నిబంధన మహాసైన్యం
మొగములందున తీవ్ర విప్లవ
ధగ ధగమ్ములు భుగభుగమ్ములు,
గగన సీమల నంటి బెదరిన
సిగలతో శివమూర్తులట్లుల
హిమ గిరీంద్ర మహోగ్ర శిఖరా
గ్రమును దాటే ధాంమికత్వం".

ఆకలి మంటల యొక్క భయం, చావు మీది భయం కంటే పెద్దది ఆ భయమే మహమ్మదీయులనే దేశాన్ని జయించేలా చేసింది. చైనా, రష్యాలలో, విప్లవాన్ని సృష్టించింది. అయితే, ఆ పద్ధతిలో, ఈ దేశంలో విప్లవాన్ని కోరుకోవడం ఆలోచించవలసిన విషయం. ఇక్కడ, మధ్య తరగతి వారు పరువు కోసం ఆకలితో భస్తారేమో కానీ, క్రింది తరగతి వాళ్లకు ఆ అవసరం రాదు. మధ్య తరగతిలో, - అందులో, ఈ దేశపు మధ్య తరగతిలో, ఐక్యమత్యం అనేది కలికానికి కూడా కానరానిది. ఇంత వాళ్ళలో విప్లవం ఎక్కడొ స్తుంది? ఇక, క్రింది తరగతిలో, ఏ మూలన్నా, అటు వంటి అవకాశం వున్నా, వాళ్ళను, ఈ సినిమాల వంటి కాలక్షేపాలు, సారాల వంటి ఉపశమనాలు, లాటరీ, జూదాల వంటి ఆశా పాశాలు; విప్లవమార్గం వైపు, ఘర్షణ వైపుకు వెళ్ళనివ్వవు.

"ఎవడికిరా నీ పాటలు
ఎవడికిరా నీ మాటలు
కవిగా! ఓ కవిగా!
నీ మాటలు విని లోకం
ఏ మాత్రం మారబోదు

అని హెచ్చరించాడు అయితే, అంత మాత్రం చేత కవికి తన లక్ష్యం మీద ఆశ చావలేదు.

ఆ వాహన చేస్తున్నాడు —
అణగిన నిరుపేదవాడు
ఆకాశం దాకా పెరిగి
లోకాలను మింగేసే
ఆ కాలం వస్తున్నది.
దూరం—దూరం"

కవి తన జీవితంలో ఒకటి సాధించాడు. నైజాం నవాబు అధికార పిశాచపు కోరలు విరగ్గొట్టారు. మరొకటి సాధిస్తాననే నమ్మకం దృఢ సంకల్పం వుండటంలో వింత లేదు. ఆలస్యమైనా సాధిస్తాడనే నమ్మాలి.

## తెగని గొలుసులు (నవల)

ఇందులో కథకు ప్రాధాన్యత లేదు మానవత్వం యొక్క రచయితకున్న లక్ష్యం సంపూర్ణంగా నాయకు డైన "కుమార్"లో నిక్షిప్తం చేయబడింది. కథా నాయకుని విశిష్ట వ్యక్తిత్వ నిర్మాణ సంరంభంలో నాయిక "కామిని"లో తాత్కాలిక శారీరిక ఉద్రేకా లను కల్పించటానికి వెనుకాడలేదు. తాత్కాలికోద్రేకా లొస్తాయి. ఆడవారిలో అధికమే అయినప్పటికీ, నాయిక పాత్రకు అన్యాయం జరిగినట్లుగా అనిపి స్తోంది. కేవలం వాస్తవికతలో మునిగిపోకుండా, కళా ధర్మమైన కల్పనకు స్థానమిస్తూ కావింపబడిన ఈ రచ నను ఉత్తమ రచనగా గుర్తింపవచ్చు. కథా నిర్మా ణంలో ఇంకొంచం మెలకవపాటించి ఉన్నట్లయితే ఉత్తమ నవలగా పరిగణింపబడేది.

ఇక ఈ నవలలో రచయిత అభిప్రాయాలేమిటో వ్రాయాలంటే నవలంతా తిరుగ వ్రాయాల్సిందే నిజ మైన మానవత్వ నిర్మాణ దృష్టిలో వారిచ్చిన పాత్రో చితాభిప్రాయ వివరణలు వేటికవే సాటి.

తెలుగు మాతృభాష కాకపోయినా, తెలుగుదేశంలో జన్మించి. తెలుగు గడ్డను తన మాతృభూమిగా భావించి, తెలంగాణా దాస్యశృంఖలాల్ని ఛేదించేందుకు అష్టకష్టాలుపడి నిజాం సైనికుల తుపాకీ గుండ్లను సైతం ఎదుర్కొని అనేక పర్యాయాలు కారాగార శిక్ష నను భవించిన దేశభక్తుడు త్యాగధని శ్రీ హీరాలాల్ మోరియా, అటు దేశ సేవతో బాటు యిటు సాహిత్య రంగంలో ప్రవేశించి మహోద్రేకంతో ఉర్దూ భాషలో కవితలు. కావ్యాలు, రచనలు, కథలు, వాక్చిత్రాలు అనేకం రచించి సాహితీమూర్తిగా, సాహిత్యకుల కంద రికీ ఆపుడుగా తన్ను తీర్చిదిద్దుకొన్న సంస్కారి శ్రీ మోరియా. వారి ఉర్దూ రచనలు చాలా వరకు తెలు గులోకి వచ్చాయి రావలసినవి చాలా వున్నాయి. వారితో పరిచయం వున్న ప్రతి వ్యక్తికీ తెలుసు శ్రీ మోరియా ఒక వ్యక్తి కాదనీ. చైతన్యవంతమైన సంస్థ యని.

— ० —

# జాజి పాటలు-ఒక పరామర్శ

—పి. వేదవతి

సృష్టితో పాటే ప్రారంభమైనది స్త్రీల మధ్య ప్రణయానురక్తి. రెండు హృదయాల మధ్య ప్రవర్తిల్లి ప్రవర్థిల్లే ఈ అనురాగ బంధం భూమ్యాకాశాలను అధిగమించింది. ఒక మహోదాత్త ప్రేమ స్వరూపంగా, జీవాత్మ పరమాత్మల అనుసంధాన శక్తిగా, సాగి-ఇటు భౌతికంగానూ, అటు పారమార్థికంగానూ మానవ జీవనగతిని శాసిస్తున్నది.

స్త్రీ పురుషుల మధ్య పరస్పరాకర్షణ కలగటం సర్వసామాన్యమైన స్థితి. అంతకుమించిన ఆత్మానుసంధానంతో కూడిన ఆంతరిక స్థితి ఏర్పడినప్పుడు-ఆ ప్రణయం పరాకాష్ఠను అందుకొంటుంది. పరమేశ్వరానుభూతిని పొందగలిగిన దశ ఇది. ఇది అతిలోక స్థితి! దైవీ స్థితి!

మహోదాత్తమూ, మనోల్లాసకరమూ అయిన ఈ శృంగార రసాన్ని స్థాయీ భేదాలతో ప్రాచీనకాలం నుంచీ కవులు వర్ణిస్తూనే ఉన్నారు, పురాణాలుగా, ఇతిహాసాలుగా, కావ్యాలుగా, ప్రబంధాలుగా మలిచి మన పూర్వకవులు ఎన్నో రసవత్తరమైన ప్రణయ గాథలను రచించారు. యౌవన ప్రాదుర్భావ దశలో స్త్రీ పురుషుల మధ్య ఉదయించే ఆకర్షణనూ, ప్రేమనూ, విరహాన్నీ, ప్రేమ సాఫల్యాన్నీ, దాంపత్య సిద్ధినీ ఎన్నో రకాలుగా వర్ణించారు.

హృదయ స్పందన భావుకతకు జీవలక్షణం. అట్టి భావుకుడు కవి కూడా అయితే, తన అనుభూతిని అక్షరబద్ధం చేసి ఇతరులకు పంచి ఇవ్వకలుగుతాడు. తాను తపించి ఇతరులను తపింపచేయడమూ, తాను రంజించి ఇతరులను రంజింపచేయటమూ అతనికి వెన్నతో నేర్చినవిద్య అవుతుంది. అందుకే కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ అయింది. ప్రణయ భావ గీతికలు ప్రపంచంలోని ప్రేయసీప్రియుల మనో గీతికలు అయినాయి.

ప్రణయం ఛందోబద్ధం కావడానికి చాలాకాలం ముందే జానపదుల నోటిపాటగా పుట్టి తీగలుగా సాగింది. ఏ చెట్టు మాటునో, గుట్టచాటునో, ఏటి వొడ్డునో, చేని గట్టునో, ప్రేమికుల గుండెలలో గుమ్మన పుట్టి పొంగి పొరలే ప్రణయం రాగంతో, అనురాగంతో మేళవించి ఒక శృంగార పదంగా వెలుస్తుంది.

'తెలి చందమామలో తియ్య పానకముంది
తెచ్చి పెదుదువు గాని రారో వెంకయ్య!'

అంటూ విలువగలిగిన రసికతా—

'మల్లెపూలు పూసినట్లు మళ్ళీమళ్ళీ మాటలాడు'

అనగలిగిన ప్రణయాధిక్యతా ఆ పల్లె ప్రేమికులది.

ఇట్లా మార్గకవులూ, దేశికవులూ పద్యం చెప్పుకున్నా, పదం పాడుకున్నా, హృదయగతమైన ప్రణయానుభూతి ఒక్కటే! పండిత కవులు ప్రణయాన్ని పద గుంఫనతో పొదిగి ఛందోగతుల్లో నడిపిస్తే, పామర జనం గుండెలను కరగ పోసుకుని, నోటి ఊటగా పాటలు కట్టి పాడుకొన్నారు.

సాహిత్యవేత్తలయిన వారు సామాన్యుల స్థాయికి దిగివచ్చి, వారి భావాలను వారి భాషలోనే వారి నోటి

వెంటే చెప్పించటం అనే నూత్న ప్రయోగం-తెలుగు సాహిత్య చరిత్రలో నందూరి వెంకట సుబ్బారావు గారి యెంకి పాటులతోనే ప్రారంభమయిందని చెప్పవచ్చు. ఆ పాటలతోనే ప్రారంభమయిందని చెప్పవచ్చు. ఆ పాటలు అట్లా ప్రాదుర్భవించటంతో అప్పట్లో తెలుగు సాహితీ ప్రపంచంలో ఒక గాలి దుమారం రేగింది. పామర భాష సాహిత్య సిద్ధిని పొందటం పండితులకూ విద్వత్కవులకూ కంటగింపు అయింది.

కాని యెంకి పాటలు రసజ్ఞ హృదయాలలో చెర గని ముద్రలు వేశాయి. పండితులు సముచిత స్థానాన్ని ఇవ్వక పోయినా, అవి తమంతట తామే ఒక స్థానాన్ని కల్పించుకుని సాహిత్య గౌరవం పొందినాయి. యెంకీ, నాయుడు బావా - తెలుగుజాతి గుండెలలో చిరంజీవులైన ప్రేమికుల జంటగా నిలిచిపోయారు.

యెంకి నాయుడు బావల ఆత్మైక ప్రణయ స్ఫూర్తి తెలుగుదేశపు కవులందరిని ఒక్క ఊపు ఊపింది. ఆ ఊపుతో కవులు క్రొత్త ఊహా కల్పనలు చేసుకొన్నారు. ప్రణయైక జీవులను క్రొత్త పాత్రల్లో అనుసంధానించుకొని గేయ రచనలు చేశారు.

బహుశ ఈ ప్రభావం వల్లనే నేమో— పండిత కవులుగా, పద్య కావ్య రచనా ధురీణులుగా—ప్రసిద్ధులైన శ్రీ పైడి పాటి సుబ్బారామ శాస్త్రి గారు గేయ కవితా సృష్టిని కూడా ప్రారంభించారు. బహుళ ప్రచారం పొందిన జాతీయ గీత సంకలనాలతో పాటు వరద కృష్ణమ్మ, మధుర భారతి వంటి రసవద్గీతికా ఖండికలను రచించారు.

పండిత ప్రకర్ష ఒకవైపున, రసభావోద్దీపితమైన హృదయ వాదము ఒకవైపున-శాస్త్రిగారి సాహితీ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దిన వనటానికి-వారి ప్రణయ గీతికా సంకలనం 'జాజిపాటలు' నిదర్శనంగా చెప్ప వచ్చు.

భాషలోను, రచనా సంవిధానంలోనూ పోలిక లేక పోయినా—నందూరి వారి యెంకి-నాయుడు బావల వంటి ప్రేయసీ ప్రియులను మరొక మూసలో పోత పోసి-జాజి—రోజాలుగా మనముందు నిలబెట్టారు శాస్త్రి గారు మాత్రా ఛందస్సుతో కూడి, తాళల యాన్వితమైన పదాల కూర్పుతో, సరళమైన శైలితో, సరసంగా సాగిన రసరాగ మాలికలు ఈ గీతికలు.

అనురాగంతో, ఆర్తితో, ఆశతో-ప్రేమ లాలసులైన ఒక జంట ఒకరిని గురించి ఒకరు పాడుకొన్న పాటలివి. ఒకరు ఒక గీతికలో ఏదో అంటారు. మరొకరు గీతికలో మరేదో చెపుతారు. ఇట్లా ఒకరు అడిగిన దానికి మరొకరు సమాధానం చెపుతున్నారా అనిపించే టట్లు మెట్టు మెట్టుగా ఈ పాటలు సాగుతాయి.

మొదట వారిద్దరికీ ఊరూ పేరూ లేదు. ఒక శుభోదయాన ఆమె అతడి యెదదలో నాట్యమాడింది. ఆమె రూపు రేఖలు అతని కళ్లముందు అస్పష్టంగా తోచినై.

"ఏమి పేరిట నిన్ను పిలిచేనే
ఏమి పేరిట నిన్ను తలిచేనే!"

అంటూ ఆమెను పాటతోనే పలకరిస్తాడు-

ఆమె జవాబు తిన్నగా పాటతోనే చెప్పదు! కొంత గడసరితనం ప్రదర్శిస్తూ-సూచ్యంగా అంటుంది ఇలా-

"జాజి పందిరి మనకు జాజులను చల్లినది
పరిమళము తెగబోసి పరవశుల చేసినది!"

అతడు అంతలోనే ఆమె మాటను ఒక అల్లిక వేస్తాడు!

"జాజి యని పిలిచేనే నిన్ను
జాజి! నా ప్రేయసీ"

అంటూ అతడు నామకరణం చేసుకుంటాడు. మరి ఆమె తక్కువ తిన్నదా!

"రాజువై నా యెదద
రతనమ్ము దోచితివి"

అని రాగం తీస్తుంది! సరి! ఇహ అతడి పేరు రాజు! ఆమె జాజి!

యెంకి పేరు ఎత్తితే చాలు-మెళ్లో పూసల పేరు, తల్లో పూవులపేరు, సెక్కిట సిన్నీ మచ్చతో కళ్ళెత్తితే కనకాబిసేకాలు కురిపిస్తూ-మన కళ్ల ముందు నిలుస్తుంది! అచ్చమైన పల్లెపడుచు రూపంలో ఒక విలక్షణమైన అందం ఆమెది. నిజానికి జానపద నాగరిక కావ్యనాయిక లెవరైనా సౌందర్యవతులే కావడం సహజం.

మరి-జాజి కూడా అందగత్తే!

"మొలక నవ్వుల మోవి సిరిచిందగా
చిలుక పచ్చని చీర జీరాడగా,
కలువలై కన్నులు వెన్నెల చిందగా,
చెఱవు నీలపు రైక నిట్టారుగా"

ఆమె ప్రియుడికి ఎదురుగా వెళ్ళి మురిపిస్తుంది, అలరిస్తుంది!

రాజు మంచి పాటగాడు. ఆ పాట అంటే జాజికి అంతులేని ఇష్టం. అతడు పాట ఆపితే ఆమె వోర్చుకోలేదు! అతడి పాటలో 'మధువునిలిచి, కోరికలు తెరిచి, అందాలను మలిచి, నందనమై' నిలుస్తుందట.

"ఆపినా వేమిరా నా రాజు
ఓపలేరా రాజు"

అంటూ పాట పాడవలసిందిగా ప్రాధేయపడుతుంది.

అతడి బాధ అతడిది! ఆమె తోడుగా లేకుంటే అతడి గొంతు పెగలదు! తోడుగా ఆమె ఉంటే-పాట పాటకు కదలి పోటు లెత్తిస్తాడట!

'నేను చందురుడైన నీవు సంద్రమ్ము
నేనె గీతమ్మైన నీవె రాగము'

అంటూ తమ ఇద్దరి అత్మైక స్థితిని అందంగా ఆవిష్కరిస్తాడు.

ఆమె కూడా తన గొంతుకలో గొంతుకలిపి పాట పాడితే-'జతకట్టి రాగాల పంతాలె నెరపినట్లు' ఉంటుందట! "జగతిలో మధుర భావమ్ములే లేపినట్లు అవుతుందట!"

అతని స్వరంతో తన స్వరం మేళవించటానికి ఆమె ఎప్పుడూ సిద్ధమే!

'శ్రుతి కలిపి పాడేను-మతి కలిపి సాగేను
నీ పాటలో నీ బాటలో ఓ రాజ నారాజ!'

అతనితో స్మృతి కలపటం పాటలోనే కాదు-బాటలో కూడ! సంగీత స్వరంలోనే కాదు-జీవన పథంలో కూడ!

వారిద్దరూ అనునిత్యమూ అలా స్వర సుధా మాధురిలో మునిగి తేలుతున్నా, వసంతోదయ వేళలో వగరు చిగురుల గొంతు పొగరుగా హెచ్చించి ఒకే పనిగ పాడే కోకిలయు పాటకు ఉలిక్కి పడకుండా ఉండలేదు!

"ఈ కూలీ ఏమొ కానీ-కోతి పెట్టు!
సాకూతముగ పాడునో-కాక ఏమొ!"
అంటూ కొందల పడుతారు!

అంత వరకూ జాజి సుకుమార ముగ్ధ ప్రసూనమే! అయితే ఎప్పుడో ఒకసారి ఆమె ప్రియుణ్ణి కవ్వించి రెట్టించ గలిగిన ప్రౌఢత్వాన్ని కూడా ప్రదర్శిస్తుంది! ఈ ప్రౌఢతతో కూడిన కొంటె తనం నండూరి వారి యెంకికి పెట్టని సొమ్ము! ఆమె కావాలని ప్రియుణ్ణి కవ్వించి, ఊరించి-ఉసురుపెట్టి లోలోన ఆనందిస్తుంది.

"కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది
దగ్గరన కూకుంటే అగ్గిసూస్తాది"

అంటూ అల్లాడి పోయేట్లు చేస్తుంది నాయుడుబావని!

జాజి కూడా క్షుద్రనాయిక ప్రణయంలో కొంత పొగరూ వగరూ ప్రదర్శించే వయస్సు ఆమెది. ఆమె ఎంత ధైర్యంగా అతడిని సరసిలో ఈదులాటకు ఆహ్వానిస్తుందో చూడండి!

ఈ "సరసిలో నీవు ఈదాలీ
నా సరస నీ ఈత చూడాలీ!"

ఇంకా—

'నాచుదారుల బోక త్రాచులా సాగాలి
రేచులై ఒకరొకరు రెచ్చిపోవాలి!'

అంటూ అతడిని రెచ్చ గొడుతుంది! ఎంత ఉరవడి! ఎంత వరవడి! ఆ మాటలో!

'నా తోటి పంతాలు నీకేలనే జాజి'

అంటూ అతడు ఆమెను కొంత అడ్డగిస్తూ, బుజ్జగిస్తూ-

"పంతులాడుట పూల బంతులాట కాదు
చెలియరో నీటితో చెలగాటమే!"

ఆమెను ఇలా వాదించటానికి ప్రయత్నిస్తాడు.

ఆ తర్వాత వారిద్దరూ ఆ సరసిలో ఈదు లాడి, సంసార సాగరంలో మునిగి తేలిన మాట నిజం!

ఈ విధంగా బాజీ రాజుల అమర ప్రేమను చిత్రంచే బాజి పాటలు అలతి అలతి పదాలతో, ఆర్ద్రి భావ సంపదతో రసజ్ఞులను రంజింప చేస్తాయి. కొన్ని పాటలలోని పదాలు వాటంతట అవె ఎక్కడినుండో ఊడి పడి వచ్చి ఇమిడి పోయినవా అనిపించేటంత ధ్వని మాధుర్యంతో నిండి ఉంటాయి చూడండి!

"అరచాటుగా, చూపు గిరవాటుగా గుండె
తెర వాటుగొని వలపు తెరచాప నెత్తినగి!"

శ్రీ పైడి పాటి వారు పండిత కవులు, సంప్రదాయికమైన పద్ధతిలో పద్యాన్ని నడిపించి మెప్పించ గలిగిన విద్వత్తును కలిగిన వారు. సాహిత్యంలో ప్రాచీన అర్వాచీన, మార్గదేశి కవితా రీతులను అవగతం చేసుకుని అనేక ప్రక్రియలలో సాహిత్య సృజనను సాగించినవారు. ఈ బాజి పాటల ద్వారా సాహితీ క్షేత్రంలో ఒక లలితమైన ప్రణయ వేదికను ప్రసరింప చేశారు. సన్నజాజి పువ్వువంటి ప్రణయ నాయిక జాజిని ఊహా పథంలో నిలుపుకొన్నప్పుడు, జీవితంలోని చీకటినీ, కష్టాన్నీ, ఈతి బాధలనీ కొంత సేపు దూరంగా ఉంచి, రసజ్ఞులైన వారు పరిమళోల్లాస భరితులవుతారు.

మెహిదీపట్నం
హైదరాబాదు-500028.

# తెలుగు సామెతలు-మానవ స్వభావ చిత్రణ

—పాలకోడేటి జగన్నాథరావు

ఒక వ్యక్తి తన భావతీవ్రతను ప్రకటించటానికి భావానికి తగిన మాటలు చాలనప్పుడు 'ఏదో సామెత చెప్పినట్టుంది' అని యనటం మనం వింటూనేఉంటాం దీన్ని బట్టి మానవుని భావవినిమయ వ్యాపారంలో సామెతలు పడుగు పేకల్లా ఎంత బాగా అల్లుకు పోయాయో అర్థమౌతుంది. సామెతలు మానవుని జీవితంలో అంత బాగా పెనవేసికొనిపోవటానికి కారణం వాని జన్మ మానవుని జన్మతో బాటు ప్రారంభం కావటమే.

మానవుని శరీరం పంచభూతాలతో నిర్మింపబడితే ఆతని మనసు కామ క్రోధ లోభ, మోహ, మదమాత్సర్యాలనే షడ్గుణాలతో నిర్మితమైంది. అందుకనే మానవాళి మనస్సులన్నీ యీ షడ్గుణాలతో సమావిష్టమై పున్నమి నాటి సముద్రంలా సంక్షుభితమై అందులో రాగద్వేష పూరితమైన కెరటాలెన్నో ఉవ్వెత్తుగా లేస్తూ పడుతూ ఉంటాయి. ఈ దృశమైన రాగద్వేష పూరితమైన మానవ సమాజంలో ఇలాంటి గుణాలతోనే పుట్టిన మానవుడు 'అమ్మ' అన్న దగ్గరి నుండి 'హరి' అని నేల కొరిగే వరకు రాగద్వేషాలతో ప్రవర్తిస్తు లేస్తు పడుతూ ఉంటాడు. జీవితంలో కొద్ది కాలం బాటు నేర్చిన విజ్ఞానానుభవం కంటె నిత్యం జీవితంలో పడుతు లేస్తు ఆర్జించిన జీవితానుభవాలే చెరగని గుణపాఠాలుగా మిగులుతాయి. ఇలా మానవుని జీవితంలోని ప్రతి క్షణం ఒక అపూర్వానుభవ సువర్ణాక్షర పంక్తియే. అలా గడచిన మానవసమాజం అనుభవ పూర్వకంగా ఆర్జించి పిత్రార్జితంగా భావి తరాల వారి కిచ్చిన ఆ యనుభవ వాక్యాలే నేటి మన సామెతలు. ఇలా సామెతలు మానవ సమాజంతో బాటు పుట్టి మానవ సమాజంతో బాటు జీవిస్తూ వస్తున్నాయి.

కాబట్టి యీ సామెతల్ని బరిశీలిస్తే సంపూర్ణ మానవ సమాజం యొక్క సహజ స్వభావమేమో స్పష్టంగా బోధపడుతుంది జానపద; శిష్టజన సాహిత్యాల కంటె ఇది స్వభావం చేత చాలా విభిన్నమైనది. పామర జన జీవన సౌందర్యాన్ని జానపద సాహిత్యమూ, ఉన్నతశ్రేణి జనజీవన సౌందర్యాన్ని శిష్ట సాహిత్యమూ అలా రెండు సాహిత్యాలు పాక్షికంగా మానవ జీవన సౌందర్యాన్ని ఆవిష్కరిస్తాయి. గాని సామెతలు మాత్రం శిష్ట-అశిష్ట జన భేదం లేకుండ సమస్త మానవ సమాజ జీవన సౌందర్యాన్ని ఆవిష్కరింప చేస్తాయి. కారణ మేమంటే సాహిత్యానందం రసానంద చర్వణస్థితి మీద ఆధారపడి యుంటుంది. కాబట్టి రస చర్వణ స్థితిలో శిష్ట అశిష్ట జనోచిత దశా భేదా లుండవచ్చు. గాని జీవన సమరంలో శిష్టాశిష్ట జనాల కెదురయ్యే సమస్యల్లో గాని- వానివల్ల కలిగే అనుభవాలలో గాని భేదమే ముంటుంది! అందుచేతనే సామెతలు సాహిత్యం కంటె నొక ప్రత్యేకతను కల్గి యుండటమే గాక సమస్త మానవ జీవన స్వభావాలను కొండనద్దంలో చూపినట్లు స్పష్టంగా సూక్ష్మంగా చూపిస్తాయి, విజ్ఞానశాస్త్ర దృష్టితో మానవ పరిణామ చరిత్రను. చారిత్రక దృష్టితో మానవ జీవన పరిణామ చరిత్రను విశ్లేషించారే గాని మానవ స్వభావ చరిత్రను మాత్రం విశ్లేషించి చెప్పిన శాస్త్రం లేదు. కాని మానవ స్వభావ చరిత్రను విశ్లేషణ చేసిన దొక్క సామెతలు మాత్రమే. కాబట్టి ఏ మానవుని స్వభావ చరిత్రను

తెలిసికోవాలన్నా సామెతలనే నాడీ గ్రంథంలో కన బడుతుంది. వైజ్ఞానికంగ మానవ పరిణామంలోను చారిత్రకంగా మానవ జీవితచరిత్ర లోను ఎన్నో మార్పులు వచ్చినట్లు నిరూపణ జరిగియుండగ మానవ స్వభావంలో మాత్రం ఆనాడు ఈనాడు కూడ ఎట్టి పరిణామం లేదనే విషయం సామెతలు నిరూపిస్తు న్నాయి. ఈ యభిప్రాయ మెంతవరకు సహేతుక మైనదో కొన్ని సామెతలను తీసికొని సోదాహరణంగా వివరిస్తాను.

ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థా లలో ధర్మ మోక్షాలకు ఆసక్తుడు కావటం కంటె భౌతిక సుఖలాలసతకు బానిసయైన మానవుడు అర్థ కామాలకే బానిసయైనాడు. తదార్జనలో మానవుడు దారి తప్పి అన్యాయంగా- దౌర్జన్యంగా ప్రవర్తించి తరతరాలకి సరిపడే సంపదను నిలువ చేసుకుంటు న్నాడు. తాను చేస్తున్నది పాపమని అతడికి తెలియక పోలేదు. అందుకనే మధ్యమధ్యలో కొన్ని కొన్ని దానాలు చేస్తూ దానితో ఆ పాపపరిహారం అయి పోయిందని సంతోషిస్తూ ఉంటాడు. ఇలాంటి వాళ్ళు మనకు నిత్యం జీవితంలో ఎంతోమంది కన్పిస్తారు. వీరిని గుర్తించి 'గోవులను చంపి చెప్పులు దానం చేసినట్టు' అని యంటాయి సామెతలు.

మరణావస్థలో ఉన్న సోదరుని ఆరోగ్యం కోసం దేవునెవరూ ప్రార్థించరు. అతడు చస్తే ఆస్తి తనకు వస్తుందిలే అనే కోరికతో ఉంటాడు మరొక సోదరుడు ఇలాగే ఉన్నత పదవి నాశించే వ్యక్తి తనపై అధికారి చిక్కుల్లో పడ్డప్పుడు అతడి ఉద్యోగం పోతే అది తనకు వస్తుందిలే అని యనుకొంటాడు. ఇలాంటి స్వభావాలు కలవారిని 'సబ్బిగాడు చస్తే అమ్మా ఆ పంచె నాది అన్నాడట' అనే జాతివాళ్ళగా గుర్తించి హెచ్చరిస్తుంటాయి సామెతలు.

ఇలాంటి దుష్టచింతన గలవారిని సామెతలు పిల్లి జాతివాళ్ళుగా నిందిస్తున్నాయి. ఎందుకంటే పిల్లులు యజమాని కళ్ళు పోవాలని కోరుకొంటాయట. అలా పోతే నిర్భయంగా ఇంట్లో పాలన్ని త్రాగవచ్చు కదా అని వాటి ఊహ, ఇలా దుష్టచింతన చేసేవాళ్లతో బాటు కుక్కలా యజమానికి శుభం కలగాలని చింతించేవాళ్ళు కూడ ఉన్నారంటూ 'పిల్లి కండ్లు పోగోరును కుక్క పిల్లలు కలుగగోరును' అనిపేర్కొ న్నాయి. ఇప్పుడు చెప్పిన దురాలోచనపరులను మానవ సమాజంలో మీరెప్పుడూ చూడలేదా???

కుక్క పిల్లి కలసి ఉండని విధంగా దురాలోచనా పరులు- సదాలోచనా పరులు ఒకచోట కలిసి మాత్రం ఉండరని 'రత్నాలన్ని ఒకచోటికి నత్తగుల్లలన్ని ఒక చోటికి చేరినట్లు చేరతారని వారి స్వభావాన్ని సామె తలు హెచ్చరిస్తున్నాయి.

మనిషికి కళ్ళు మూసుకుపోయేలా చేసేవానిలో అధికార మొకటి. ఇది కలిగిన వాణ్ని గూర్చి

కం॥ అధికార రోగపూరిత

బధిరాంధక శవము చూడ పాపము సుమతీ

అని సుమతీ శతకకారుడు చెప్పితే క్రూరుడైన అధి కారిని నరమాంసం తినే పులి కంటె హీనంగా అభి వర్ణిస్తాయి,

'పులి కంటబడినవాడైనా బ్రతుకవచ్చునేమో గాని నగరివారి (అధికార్లు) ఎదుట పడి మాత్రం బ్రతుక లేము.' కారణ మేమంటే క్రింది ఉద్యోగి ఎడల తప్పులు లేకపోయినా అధికార్లకు మాత్ర మెన్నో తప్పులు కనిపిస్తాయి. అక్కడి నుంచి పిచ్చుక మీద బ్రహ్మాస్త్రాలు ప్రయోగిస్తూ ఉంటారు. ఇలాంటి అధి కార్ల స్వభావాన్ని 'ఆకలి గొన్న కరణం పాతకవిలె విప్పుతాడు' అని చెపుతుంది సామెత. ఇక్కడ ఆకలి యంటే కోపగించిన అని యర్థం. డబ్బు అవసరము వచ్చిన అని కూడ అర్థమే. ఈ రెండు సందర్భాలలో

అధికార్లు క్రిందివారి మీద పాత కవిళ్ళువిప్పి బాధిస్తూ ఉండటం నేడందరకు స్వానుభవమే కదా!

అధికార్ల స్వభావమింకా యెన్నో విధాలుగా ఉంటుంది. తాము తప్పు చేస్తె అది యేదో యాదృచ్ఛికంగా (accidental) జరిగినట్టు భావిస్తారు అదే క్రింది ఉద్యోగి వల్ల జరిగితే వాడు బుద్ధిపూర్వకంగా దేశద్రోహమేదో చేసినట్టు ఆర్భాటం చేస్తారు ఇలాంటి వాళ్ల స్వభావాన్ని గూర్చి అత్తగారు పోగొట్టినది అడు గోటికుండ కోడలు పోగొట్టినది క్రొత్తకుండ' అని చెపుతుంది సామెత. అన్ని పనులు క్రిందివారు చేస్తే దాన్ని పూర్తి చేసి కీర్తికిరీటాన్ని తానలంకరించుకొనే అధికార్ల స్వభావాన్ని 'అమర్చిన దాంట్లో అత్తగారు వేలు పెట్టినట్టు' ఉంటుందని జాగ్రత్తలు నేర్పుతున్నాయి సామెతలు. ఈ అధికార్లు ఎక్కడో వారు కాదు. అంతా మీ ముందున్నవారే. వాళ్లను గురించే సామెతలు వింతగా చెప్పాయి.

దారిద్ర్యం-బాధలు-కన్నీళ్ళు- ఇవన్ని ఎప్పుడూ ఉన్నాయి. ఒక ప్రక్క వీటిలో సతమతమవుతూ ఎంతోమంది ఉంటూ ఉండగా ఇవేవీ మనస్సుకు పట్టక భోగ విలాసాల కోసం బాధలుపడుతు కన్నీళ్లు కార్చేవాళ్ళు మరో ప్రక్క ఉన్నారు. మానవ సమాజంలోని చీకటి వెలుగుల వంటి భిన్న స్వభావులైన వ్యక్తులను సామెత లెంతగానో అసహ్యించుకుంటున్నాయి. తను మనసులో ఉన్న అక్కస్సు అంతా కడుపు కూటి కేడిస్తే కొప్పు పూలకేడ్చింది. 2. గుళ్ళో దేవునకు నైవేద్యమునకే లేకుంటే పూజారి పులిహోర కేడ్చినాడు 3. ఇంటిదేవర యీగిచస్తే పొలం దేవర గంప జాతర అడిగిందట. 4. గొడ్డువాడు గొడ్డు కేడిస్తే గొడారివాడు తోలు కేడ్చినాడు. అని ఇలా యెన్ని మాటల్లో తీర్చికొన్నాయో చూడండి సామెతలు.

ఇలా సామెతలచే గట్టిగా నిందింపబడిన వాళ్లలో తిండికి దున్నపోతులు పనికి మాత్రం సోమరి పోతు లయిన వాళ్ళు ముఖ్యులు. వీళ్ల స్వభావాన్ని వ్యంగ్యంగా కబళమంటె నోరు తెరచి కళ్లెమంటె నోరు మూసినట్టు 'దున్నబోతే దూడల్లోను మేయబోతే ఆవుల్లోను' దున్నే రోజుల్లో దూరదేశం పోయి కోత రోజుల్లో కొడవలి పుచ్చుకు వచ్చాడుట, ఎన్నో విధాల తూర్పార పట్టాయి సామెతలు, అయినా ఏం ప్రయోజనం. తాటాకు చప్పుళ్లకు కుందేళ్లు బెదరవన్నట్టు వాళ్లంతా మనకు కనిపిస్తూనే ఉన్నారు. ఎన్నితిట్టినా బుద్ధిరాని యిలాంటి మొండి స్వభావుల్ని దున్నపోతు మీద వాన కురిసినట్టు సామెతలెన్ని తిట్టినా ప్రయోజనం లేక వాళ్లకో నమస్కారం పెట్టేశాయి.

అయినా పట్టు విడని విక్రమార్కుడిలా సామెతలు సమాజంలోని చిత్ర విచిత్ర స్వభావాల వారి నందరిని ఏరి ఏరి వారి రంగుల్ని బయట పెట్టుతూనే ఉన్నాయి. అలాంటి వాళ్లలో గ్రామవాసుల కథ. వాళ్లతో వాళ్ల కెప్పుడు పడదు. ఎవరి సిద్ధాంతం వాళ్లది. ఏ ఒక్కడు ఎదుటి వాని సిద్ధాంతాన్ని అంగీకరించడు అందు చేతనే గ్రామాల్లో ఏ సత్కార్యం ప్రారంభింపబడదు. ప్రారంభింపబడిన అది మధ్యలోనే ఆగిపోతుంది. ఇప్పటికీ గ్రామస్థుల్లో కనబడే యీ విచిత్ర స్వభావాన్ని ఊరు ఉసిరికాయంత, సిద్ధాంతం తాటికాయంత అని నిర్వచిస్తుంది. సామెత ఇలాంటి గ్రామాల్లోని ప్రజలు తమకు సంబంధించిన పనులను కూడ ఎలా చెడగొట్టుకుంటారో కూడదున్న నీడకు లాగితే ఎద్దు ఎండకులాగుతుంది" అని వివరిస్తాయి సామెతలు. ఇది గ్రామస్థులకే పరిమితమను కోనక్కరలేదు. భిన్న మనస్తత్వాలు కలవాళ్ళు తమ కప్పగించిన సమిష్టి బాధ్యతను ఇంత అందంగా నిర్వహిస్తారని కూడ సామెత ఆంతర్యం.

తోడి వాళ్లను సాహస కార్యాలకు ప్రోత్సహిస్తూ తాము మాత్రమ లాంటిపనులకు దూరంగా ఉంటూ

ఉంటారు కొందరు. వస్తే లాభాన్ని తాను పొంద వచ్చు. లేదా అతడే నష్టపడతాడులే అనే అతి తెలివి స్వభావంగల ఇట్టి వాళ్లను కనిపెట్టి ఉరుకు ఉరుకుమనే వాడేగాని తోడుఉరుకే వాడులేడు సుమాయని జ్ఞానో పదేశం చేస్తున్నాయి సామెతలు.

జీవితంలో విధం (సచ్ఛీలం) చెడితే చెడ్డాములేగాని కూడు వెయ్యి విధాల దొరుకుతోందిలే అని సంతృప్తి వాళ్ళెంతమందో ఉన్నారంటు మాటలకందని వాళ్ల స్వభావాన్ని మనసుకు హత్తేలా ఎక్కడ కడితేనేమి మనమందలో ఈనితేసరి అని సామెతలు చెపుతాయి.

ఆడలేక మద్దెల ఓడన్నట్లు తన చేతగాని తనాన్ని యితరుల మీదనెట్టే ప్రయోజకులు; ఆరునెలలు వాయిం చాక మద్దెల గట్టిదాఓటిదా అనుకొనే నిత్య శంకితులూ; చెట్టెక్కించి నిచ్చెన తీసే నమ్మకద్రోహులూ. కాలు పట్టుకొని లాగినా చూరుపట్టుకు వ్రేలాడేలజ్జాహీనులు, మాటలు కోటలు దాటుతాయి. కాలుగడపదాట నివ్వ నివాత్సారులు క్రియా శూన్యులు, కాసుకు గతిలేదు కోటికి కాడివేసే ఆడంబరశీలురూ; ఈత గింజయిచ్చి తాటి గింజ లాగే తెలివైన మోసగాళ్ళు, డబ్బుకు ప్రాణానికి లంకె అయి ఎంగిలి చేత్తోకాకిని కూడ విదల్చని లోభ స్వభావులూ ఎదుటివారి పొయ్యిమండితే తమ పొయ్యిలో నీళ్ళు పోసుకొనే అసూయాపరులు పొదుగుకోసి పాలుత్రాగే అత్యాశాపరులు పాలుత్రాగి రొమ్ము గుద్దే కృతఘ్నులు ఇలా జీవితంలో నిత్యం తటస్థపడే విభిన్న స్వభావాల వాళ్ళను సామెతలు రమ్యంగా పరిచయం చేస్తాయి

సామెతలు చెప్పిన వీరంతా నిన్ననేకాదు ఉన్నది. ఈ రోజు ఉన్నారు. రేపు ఉంటారు. వీరు కూడ మన మానవ సమాజంలోని వాళ్ళే, ఎవరెలాంటి వారో ముందుగా ఎవరికీ తెలియదు కదా. కాబట్టి అంతా చూడటానికి చుంచెలకలే కాని సమయంవస్తే గుంటలు త్రవ్వడానికి మాత్రం పందికొక్కులే. అంటూ పైకి తెలియని మానవ మన స్వభావాన్ని సోదాహరణంగా చెప్పుతున్నాయి. సామెతలు ఇంత మానవ స్వభావ వైవిద్యానికి మూలమైన మనస్సు యొక్క స్వభావమే అగాధమంటూ బావిలోతు చూడవచ్చుగాని మనస్సు లోతు చూడలేమని నిర్వచిస్తున్నాయి సామెతలు. మన తెలుగు సామెతలు మాత్రమే కాదు. ఇతర భాషా సామెతలు కూడ మానవ స్వభావ మట్టివే అని యంటు న్నాయి.

No one can see into another further then his teeth (Danisu).

ఇలా అగాధమైన మానవ మన స్వభావాన్ని తరచి తరచి విశ్లేషించే యీ సామెతలను మానవ మనస్స్వభావ చరిత్రలుగా భావించటం తప్పుకాదేమో.

—0—

# నేటి నవల–ఒక పరిశోధన

—సి. హెచ్. సుజాత

నవల సమకాలీన జీవితానికి ప్రతిబింబం అంటే అద్దంలో ప్రతిబింబిస్తున్నదని అర్థం కాదు. రచయిత కూడా సమాజంలో వ్యక్తి కనుక అతని దృష్టి విమర్శ అంతా సామాజిక జీవితంలో ఒక భాగం అవుతుంది. ఏ రచన అయినా, రచయిత అనుభవం వరకే పరిమితమై వుంటుంది. అతని దృష్టి విమర్శ అంతా సామాజిక జీవితంలో ఒక భాగం అవుతుంది. అందువల్ల సమకాలీన జీవితం గురించి ఎన్నో నవలలు వున్నా, రాజకీయాలకు ప్రాముఖ్యం. ఇస్తు ఒకరు నవల వ్రాస్తే మరొకరు వ్యక్తి జీవితానికి ప్రాముఖ్యత ఇస్తూ పాత్ర చిత్రణ కథా గమనం సాగిస్తారు.

తెలుగు నవల పుట్టి నూరు సంవత్సరాలు దాటుతోంది. కాలానుగుణంగా ఎన్నో మార్పులు వచ్చేయి. ఒకనాడు కాలక్షేపం కోసం పనికి వచ్చిన కథలు నేడు సాంఘిక సమస్యల్ని చర్చిస్తున్నాయి. వ్యవసాయమే ప్రధానంగా వున్నా–సామాజిక సంబంధాలలో క్రమంగా వ్యాపార దృష్టి ప్రబలుతూ, మనుష్యుల వ్యవహారాల్లో ముఖ్యంగా స్త్రీల జీవన సరళిలో ఎన్నో పరిణామాలు క్రొత్త సమస్యలు వచ్చేయి. వీటిని తెలుగు నవల చక్కగా ప్రతిబింబించింది.

వీరేశలింగంగారి రాజశేఖర చరిత్రములో, బ్రహ్మ సమాజ మత ప్రభావం కనబడుతోంది. ఉన్నవ లక్ష్మినారాయణగారి మాలపల్లి, ఉప్పల లక్ష్మణరావు గారి అతడు, ఆమె, మొదలయిన నవలల్లో గాంధీ గారి జాతీయోద్యమం, సంస్కరణ మొదలగునవి ప్రతిఫలించేయి. భూస్వామ్యం, ధనిక స్వామ్యంగా మారే సంధి యుగపు పోరాటం కనబడుతుంది. ఆ తరువాత వచ్చిన విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు, గోపీచంద్ అసమర్థుని జీవితయాత్ర, మొదలయిన నవలల్లో. పాత ఆర్థిక వ్యవస్థ ఆలోచనలు, ప్రతి పాత్ర చిత్రణలోనూ కనబడుతుంది. కందుకూరి వీరేశలింగం గారి తరువాత, చిలకమర్తి లక్ష్మి నరసింహం గారు రామచంద్ర విజయం, హేమలత, అహల్యాబాయి ఇలా ఎన్నో నవలలు వ్రాశారు.

రామచంద్ర విజయంలో అగ్రవర్ణాల దుస్థితి, ఆర్థిక, వ్యవస్థ చక్కగా బోధపడుతుంది. స్త్రీలలో రావలిసిన చైతన్యం కోసం 'చలం'గారు ఒక ఉద్యమం లాగా రచన సాగించేరు. ఆ తరువాత కథక చక్రవర్తి శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి శకం. 1933-48లో దేశంలో వున్న ఆర్థిక వ్యవస్థ, నాటి పరిశ్రమలు, సగటు మనిషి జీవితం ఆలోచనలు ఇవేకాక, ఏ మాత్రం ప్రత్యేకత కనుపించని తాతయ్యలు, అమ్మమ్మల పాత్రలను కూడా, వారు ప్రత్యేకంగా మలచేరు వారి నవలలలో.

క్లిష్టమయిన జీవిత సమస్యలను విడమరిచి చెప్పటంలోనూ, సమాజంలో, బాధలకు గురి అయిన అసహాయుల గాథలు చిత్రించటంలోనూ, మన స్తత్వాలు విశ్లేషించటంలోనూ, జీవిత సత్యాలు పొందు పరచటంలోనూ కొడవటిగంటికుటుంబరావు గారు సిద్ధహస్తులు.

తమ అనుభవం నవలలో మూడు తరాల వ్యవధిలో, వచ్చిన మార్పులు, వాటితోపాటు మారలేని మనుష్యులు

సంసారంలో వచ్చే ఒడిదుడుకులను చిత్రించేరు. ఇది వరకటి భూస్వామ్య కుటుంబాలలో వుండే అవలక్షణాలు, పిల్లల పెంపకంలో, వైరుధ్యాలు, ఆధునిక భావాలను అవగతం చేసుకోలేని మనస్తత్వాలను, రచయిత ఇందులో సున్నితంగా చిత్రించేరు.

తల్లిలేని బిడ్డలు, ముసలమ్మల పెంపకంలో, ఎలా కొరకాకుండా పోతారో సవతితల్లి నవలలో చూపేరు 1954లో మహీధర రామమోహనరావుగారు, రథచక్రాలలో, నవలా రచన మొదలుపెడుతూ, కమ్యూనిష్టు పార్టీని, ఆనాటి ప్రభుత్వపు తీరు తెన్నులు, వాటి రాజకీయ, సాంఘిక, పరిస్థితులను, వర్ణిస్తు ఈదారి ఎక్కడికి, కత్తులవంతెన, కొల్లాయి గట్టితేనేమి, ఇలా ఎన్నో సాంఘిక ప్రయోజనం వున్న రచనలు చేశారు. వారు వ్రాసిన కత్తుల వంతెన గురించి, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు ప్రేమ పెళ్ళి సమస్యలు అన్ని కోణాల నుంచీ చిత్రించిన నవల మరొకటి రాలేదన్నారు.

తెలుగు దేశంలో ఆర్థిక పరిస్థితులు, మధ్య తరగతి జీవితాలను గురించి, వారి ఫాల్స్ ప్రిస్టేజీ గురించి, వ్రాసిన నవలల్లో శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి పెంకుటిల్లు మంచి ఉదాహరణ, కొడవటి గంటి కుటుంబరావు గారు, కొమ్మూరి వేణు గోపాలరావుగారు ఇద్దరూ మధ్య తరగతి జీవితాల గురించే వ్రాసినా, సాధించిన ప్రయోజనాలు మాత్రం భిన్నమైనవి. పరస్పర విరుద్ధమైనవి కొమ్మూరి వేణుగోపాల రావుగారి, భారతి, హౌస్ సర్జన్ ఊగవే ఊయల ఇవన్నీ వైద్య శాస్త్రంలోని ఒక్కొ మలుపు పాఠకులకు చూపించేయి.

యువతీ యువకుల మనస్తత్వాలు వారి జీవన సరళిలో ఉన్నా వికృతకోణాలు చూపే వాసిరెడ్డి సీతాదేవిగారి మరీచిక ఒక చక్కని నవల. యవ్వనంలో వున్న ఆడపిల్ల సరి అయిన గైడెన్స్ లేకపోతే, నాగరికత ప్రభావానికిలోనై, ఎలాంటి దుస్థితికి లోనవుతుందో చక్కగా వర్ణించేరు. మమతాను రాగాలను నేటి సమాజంలో వున్న స్థానాన్ని ఎత్తి చూపిస్తూ మట్టి మనిషి నవల వ్రాశారు

శ్రీదేవిగారి కాలాతీత వ్యక్తులు, ఆధునిక యువతరం ఆలోచనలు వారి పరిస్థితులను అద్దం చూపుతు వచ్చిన మొట్ట మొదటి నవల.

స్త్రీలు చదువుకొని ఉద్యోగాలు చేస్తూ సమాజంలో స్వతంత్రంగా జీవించేప్పుడు వచ్చే సమస్యల్ని ఉదాహరిస్తూ మాలతీ చందూర్‌గారు ఎన్నో రచనలు చేశారు. సద్యోగం, అహం-అనురాగం చంపకం-చదపురుగులు నవలలు మంచి ఉదారణలు. సమాజంలో డబ్బుకున్న విలువను ఎత్తిచూపుతూ, దాని ముందు, ఎలాటి బంధాలు వుండవని, రేణుకాదేవి ఆత్మకథ వ్రాశారు. క్రొత్త కెరటాలు పేరిట ఆమె అనువదించిన, ఎన్నో ఇంగ్లీషు నవలలు, ప్రమదావనం పేరిట వచ్చిన వ్యాసాలు మొదలయినవి మన సమాజానికి అద్దం పట్టిన పుస్తకాలు.

లత సాహిత్యం పేరిట ఒక ప్రత్యేకత సంతరించుకొన్నవారు శ్రీమతి తెన్నేటి హేమలత. తన చుట్టు అల్లుకొన్న ఛాందస భావాలు చిక్కుముడులు, సాంప్రదాయాలు ఛేదించు కొనేందుకు నేటి స్త్రీలు సాగిస్తున్న నిరంతర సమరాన్ని తమ నవలలలో ప్రతిబింబింపజేశారు. ఎడారి పువ్వులు, మహానగరంలో స్త్రీ, ప్రేమ రాహిత్యంలో స్త్రీ, ఇవన్నీ స్త్రీల సమస్యలను గురించిన పుస్తకాలే ఆమె అంతరంగ చిత్రం ఒక అందమైన స్వప్నం ఆమె ఊహించే సమాజమూ స్వప్నం మాత్రమే. "స్త్రీ సమస్యలు, స్త్రీల జీవితాలకే పరిమితం కాదు, అది పురుషుల జీవితాలకు సంబంధం లేని విషయాలూ కావు. స్త్రీల సమస్యల మీద స్త్రీకి సరి అగు విజ్ఞానం కలగటం ఎంత అవసరమో, పురుషులకు కూడా అంతే అవసరం"

"ప్రతి వ్యక్తి తన భావాలు, ఆలోచనా విధానం చైతన్యం సరి అయిన మార్గంలో వుండేలా చూసుకో

వాలి. తమ జీవిత అభివృద్ధికి వ్యక్తి గతంగా తాను చేసుకో గలిగినంత చేసుకోవాలి" అంటూ రంగనాయకమ్మగారు తమ నవలల్లో ఒక కొత్త విప్లవం సాధించేరు. వారు వ్రాసిన బలిపీఠం పేక మేడలు స్త్రీ, చదువుకొన్న కమల, అంధకారంలో ఇవన్నీ నేటి స్త్రీల దౌర్భాగ్యానికి మచ్చుతునకలు

ఒక ఆడది ఒంటరిగా జీవించ గలిగే తాహతుకి, మన సమాజం పెరగలేదు మనం అంత పురోగమించ లేదు అంటు నిరాశపడి పోయారు రంగనాయకమ్మ గారు పేక మేడలు నవలలో

సమాజంలో స్త్రీ, స్థానం బానిసకన్నా అధమం. భార్య, భర్త సంబంధ కుటుంబ జీవితంలో వేరు. గృహ నిర్వహణ, పిల్లల పెంపకం సామాజిక శ్రమగా పరిగణించ లేక పోవటం వలన వచ్చిన కష్టం మొదటిది.

స్త్రీలలో రావలసినంత చైతన్యం రాలేదని, దుఃఖ పడుతు ఒక అపూర్వమయిన ఊహా లోకాన్ని ఊహిస్తూ, అలాంటి చైతన్యం రావాలని కోరుకొంటు మనసారా తపించి వ్రాసిన నవల జానకి విముక్తి.

"కొంతమంది భర్తతో సంతృప్తిపడి, ఇతర హక్కుల ప్రశక్తి లేకుండా బ్రతికే ఆడవాళ్ళు, కొంత మంది యజమానులతో తృప్తి పడి ఇతర హక్కుల ప్రశక్తి లేకుండా; బ్రతికే బానిసల్లాంటి వాళ్లు. రెండో మనిషి దయి మీద, మంచి తనం మీద, ఆధారపడి బ్రతకటం అంటే, అది స్వతంత్ర జీవితం కానే కాదని వాళ్లకు అర్థం అయేట్లు చెప్పాలి."

"స్త్రీలకు స్వతంత్ర జీవితం ఒకటి వుందని ప్రపంచం ఎరుగదు ఇప్పుడు అట్టి జ్ఞానం సిద్ధంగా వుంది. దానిని తెలుసు కోకపోతే ఆడవాళ్ళకు ఎప్పటికీ విముక్తి వుండదు. వాళ్ళ సమస్యల కారణాలు వాళ్ళే అర్థం చేసుకోలేకపోతే వాళ్ళని వాళ్ళు ఎలా విముక్తి చేసుకోగలుగుతారు"

అంటారు రంగనాయకమ్మగారు ఆ నవలలో ఒక చోట. ఆడవాళ్ళ సమస్యలు ప్రధానంగామూడు రకాలు ఆడవాళ్ళు స్వతంత్రంగా తమని తాము పోషించుకొనే పరిస్థితిలో లేరు. మొగవాళ్ళ సంపాదన మీదే బ్రతుకుతున్నారు.

ఆడవాళ్ళ శ్రమ ఇంటిపనులకే పరిమితం. మూడవది పిల్లల పెంపకం, ఒక బాధ్యత శ్రమ. దీనికి, ఒక కమ్యూనిష్టు పరిష్కారం అంటూ ఆమె చెప్పారు. ఆడవాళ్ళకు స్వాతంత్ర సంపాదన ఉండటం. మూడవది పిల్లల పెంపకంలో తండ్రికి సమాన బాధ్యత వుండటం.

కానీ గృహ జీవితంలో శ్రమ విభజన సమస్య కుటుంబం లోనిది. అందుచేత ఇంటి పనులలో భర్త సాయం చేయట మన్నది. నేడు ఎన్నో కుటుంబాలతో వున్నది. దానివల్ల స్త్రీకి స్వాతంత్రం రాదు.

నవల మూడవ భాగంలో రంగనాయకమ్మగారి దృష్టిలో ఆదర్శ దాంపత్యం అంటే ఎలా వుండాలో దానిని చిత్రించే ప్రయత్నంచేశారు. కానీ మూడవ భాగంలోనూ నవల పూర్తి కాలేదని ఆమె అన్నారు. ఎందుకంటే స్త్రీని విముక్తి చేయగల సమాజం మనకు ఏర్పడినప్పుడు స్త్రీ విముక్తిని కథా వస్తువుగా తీసుకొని ఆ కథ పూర్త అయిందని చెప్పటం సాధ్యం కాదన్నారు. విముక్తి ఇచ్చే గమ్యం వేపు మొదటి, అడుగువేయటం విముక్తితో సమానమే నన్నారు.

కానీ మహీధర రామమోహన రావుగారి ఈ కథ ఇంతే నవలలో రాజ్యలక్ష్మి పాత్ర చదువుకొని అవసరం కొద్దీ ఉద్యోగం చేస్తున్న యువతి ఆమె భర్త ఆగడు భరించలేక వేరే ఉంటానని బెదిరిస్తుంది. పురుష ప్రపంచానికి ప్రతినిధి అయిన ఆ భర్త ఆ బెదిరింపు కొంచెమయినా లెక్క చేయడు. అక్కడికా కథ అంతే

ఆ కథ గురించి వ్రాస్తూ మహీధర రామమోహన రావుగారు మన సిద్ధాంతాలను అమలు జరుపవలసినది, ఈనాడు మనం ఉంటున్న సమాజంలో. అది మరువ కూడదు. ప్రేమ ప్రాతి పదికనే అంగీకరించని ఈ సమాజంలో ఆడదాన్ని కనబడని శృంఖలాలలో బాని సగా బంధించిన ఈ సమాజంలో మనం వున్నపాటున మన సిద్ధాంతాలను అమలు జరుప పూనుకొంటే ఫలి తం ఎలా వుంటుంది. ఇప్పుడున్న సంసారాలలో నూటికి తొంభై తొమ్మిది విచ్ఛిన్నం అవుతాయి కొన్ని కొన్ని సందర్భాలలో స్త్రీలే తమ అర్థం లేని అహంతో, సంసార జీవితాల్ని, చికాకు పరుచుకొని చివరకు పశ్చాత్తా పడటం జరుగుతుంది.

శ్రీ బాపిరాజు గారి నారాయణరావులో శారద, రంగనాయకమ్మగారి బలిపీఠంలో అరుణ, కావిలిపాటి విజయలక్ష్మిగారి విధి విశ్వాసాలులో మధుమతి, సి. ఆనందారామం గారి నాన్నృషిః కురుతే లో శారద పాత్రలు వుదాహరణలు.

వివాహ వ్యవస్థలో లోటుపాట్లు వున్నాయి. కనుక స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం మంచిదనే వాదన, చలం గారితో బయలు దేరింది. వివాహం పేరిట స్త్రీకి జరుగు తున్న అన్యాయాలు అసంతృప్తి ఆయన అన్ని రకా లుగా ప్రకటించేరు.

కానీ ఈ విషయంలో ఆయనకే నిశ్చయమైన అభిప్రాయం లేనట్లుంది

శ్రీమతి లతగారు ఈభావననే సమర్థించేరు. కానీ, ఏ నవలలో అయినా స్వేచ్ఛా ప్రణయాన్ని అనుసరిం చిన వ్యక్తులకు చివరకు ఆత్మహత్య శరణ్యమయింది.

వ్యక్తి సుఖ జీవితానికి, సాంఘిక, సంక్షేమానికి, కుటుంబమే మూలాధారం.

పి సత్యవతిగారి 'గొడుగు' నవల ఈ విషయాన్ని నిరూపించింది.

శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారు దాదాపు అన్ని సమస్యల మీద నవలలు వ్రాశారు. ఇదీ నాదేశం తరం మారింది. మనిషి మతము, మిష్టర్‌సంపత్ అధి కారులు. ఆశ్రితజనులు ఇవన్నీ విభిన్న సామాజిక సమస్యలు ఇతి వృత్తాలుగా చేసుకొని వ్రాసిన నవలలే.

ఈ సంవత్సరం విశాలాంధ్ర పబ్లికేషన్స్ వారి బహుమతి పొందిన నవలలు, చీలని పాయలు, పట్ట ణంలో బ్రతుకుదామని, ఈ రెండు నవలలు ఇతి వృత్తాలు వేరే అయినా, రెంటికి ఒక సమీపం వుంది.

సమాజంలో వ్యక్తులు పొందుతున్న బాధలకు చికాకులకు కారణం మనచుట్టూ వున్న వ్యక్తులతో దుర్మార్గం, దురలవాట్లు, కానేకాదు. సమాజంలోవున్న అవ్యవస్థ. దానికి మూలం. సమాజం మారితే తప్ప వ్యక్తులలో వున్న మంచి తనం మానవుని జీవితాన్ని సుఖవంతం చేయలేవు

పూర్వ సాహిత్యమంతా చదివి, మేధను వికసింప చేసుకొని రచయిత, తన జీవితానుభవాలు కాసి వడ బోసి, చక్కని కథను ఎన్నుకొని, కథాబలమైన పాత్రలను సృష్టించి, పాత్రితోతమైన సంభాషణ చెప్పించి; ఏదో ఒక సమాజ, సాహిత్య ప్రయోజనం వుండేలా వ్రాసేది వుత్తమ నవల.

అపూర్వమయిన ప్రేమలు అపురూప స్నేహాలు అర్థం లేని త్యాగాలు- పశ్చాత్తాపంతో పాటు, పరివర్తనలు చావులు బ్రతుకులు అన్ని మసాలతో వుండే నవలలు చాలా వస్తున్నాయి. జి. భవానీ కృష్ణమూర్తి వ్రాసిన ప్రేమమయి ఒక ఉదాహరణ.

సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలకు వారిపై జరుగుతున్న అత్యాచారాలను ప్రతిఘటించి నిలబడేలా, స్త్రీని చైతన్య వంతం చేయవలసిన రచ యిత్రులు, బాధతో రహితంగా, అర్థంలేని త్యాగాలను గురించి, గొప్పగా కీర్తిస్తూ వ్రాసే నవలలు ఎన్నో వస్తున్నాయి.

చెరుకూరి రమాదేవి వ్రాసిన 'లత' నవలలోని ఈనాడు వస్తున్న చాలా నవలలకన్నా, సంఘటనలు పాత్రలు చాలా సజీవంగా వున్నాయి. ఆంధ్ర రాష్ట్రంలో పుట్టి పెరిగిన లత పట్టుదలతో జీవితంలో ముందుకు సాగి తమ కోరిన జీవిత భాగస్వామిని ఎన్నుకోవటం నవలలో వున్న విషయం.

లత పరంగా ఆమె అనుభూతులు, ఆలోచనలు జీవితంపట్ల ఆమె దృక్పథాన్ని రచయిత్రి చాలా నేర్పుగా చిత్రీకరించేరు

ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారు తమ మొగలి రేకులు నవలలో కథా వస్తువు ఎంచుకోవటంలో, కథ మలచటంలో శ్రద్ధ తీసుకొని దారి తప్పిన భార్యను ప్రేమించగల భర్త పాత్రను ఎంతో సమర్థవంతంగా చిత్రించేరు. కానీ ప్రేమించిన మనిషి నవల ఊహాలోకపు ప్రణయాలు, మానవ హృదయ దౌర్జన్యాలు, అసమర్థతలు, చాటి చెప్పేయి.

తెలుగు మనస్తత్వంతో, విదేశీ వాతావరణంలో వ్రాసిన యార్లగడ్డ మీరగారు ముఖపత్ర సుందరి నవల, తెలుగు కుటుంబాలు విదేశీయ ఆచార వ్యవహారాలతో నాగరికతతో అలవాటు పడలేక నలిగి పోయే పాత్రలతో చక్కగా నవలను మలచేరు.

మరీచిక, 'మరో మనసు కథ' నేటి యువతీ యువకుల మనోభావలకు, మనశ్చాంచల్యాలకు దర్పణం పట్టిన వాసిరెడ్డి సీతాదేవి గారి నవలలు.

విద్యార్థుల మనస్తత్వాల్ని వర్ణించే నవలల్లో పేర్కొనదగినవి నవీన్ వ్రాసిన అంపశయ్య, వీరాజీ తొలిమజిలీ, మొదలయినవి వైద్య వృత్తిని ప్రధానాంశంగా తీసుకొని కొమ్మూరి వేణుగోపాలరావు గారి హౌస్ సర్జన్, వర్ణాంతర వివాహాలను గురించిన బలిపీఠం యన్. ఆర్. నందిగారి నైమిశారణ్యం మొదలయినవి మంచి నవలలు.

శ్రీమతి వేదుల మీనాక్షిదేవిగారు అన్నట్లు ఏ రచన చేయదలచినా, ఒక్కమాట మన తెలుగు సాహిత్యం గురించి తెలుసుకోవటం ముఖ్యం. మన పూర్వకవులు, గ్రంథాలలో మన నడవడికి ఒక్క చక్కని బాట వేసి వుంచేరు. మన సాహిత్యంలో ఏయే గ్రంథాలున్నా నవలకు వాటి ప్రాశస్త్యం ఏమిటో తెలుసుకొనియే, ఇటు రచయిత్రీ లోకమేకాక, పాఠకలోకం కూడా కృషి చేయాలి

—0 --

జగ్గాపురం
వయా యడ్లపాడు
గుంటూరు (జిల్లా)

# కాఫ్కా మినీ కథలు

అనువాదం : వేమూరి ఆంజనేయశర్మ

(కాఫ్కా విశ్వవిఖ్యాతి గాంచిన రచయిత. ఆయన అస్తిత్వవాద రచయితల్లో చాలా ప్రముఖస్థానాన్ని వహించినవాడు. ఆయన రచనల్ని అర్థం చేసుకోనడమే చాలా కష్టం. అర్థం చేసుకొన్న కొద్దీ, అనుభూతుల లోతుల్లోకి దిగిన కొద్దీ ఆయన రచనల్ని చదివి జనం ఉద్రూత లూగిపోయారంటే అతిశయోక్తి లేదు. ఆయన చాలా మినీకథలు వ్రాశాడు. కొన్ని మినీకథల్ని తెలుగులోకి అనువదించి ప్రచురిస్తున్నాము.)

## 1.రాబందు

ఒక రాబందు నాకాళ్ళను తనవాడియైన ముక్కుతో పొడవడం ఆరంభించింది. నాకాళ్ల మోజాలూ, బూట్లూ ఎప్పుడో ముక్కముక్కలై పోగా ఆ రాబందు ముక్కు పొడుపులు నా కాళ్లకు తగలడం ఆరంభించాయి. ఉండి ఉండి ఆ రాబందు నా కాళ్లచుట్టూ నాచుట్టూగిరగిర తిరిగేది. ఆ తిరుగుతున్నంత సేపూ వ్యాకులంగా వున్నట్లు కన్పించేది. తిరిగి పొడవడం ఆరంభించేది. ఇంతలో ఒక పెద్దమనిషి నా దగ్గరకు వచ్చాడు. ఈ దృశ్యాన్నంతా చూచాడు. ఏమిటిది? ఏమిటి ఈ బాధ? అనిఅడిగాడు. 'మొదటఆరాబందునుఎదుర్కొన్నాను. దాని గొంతు నులిమివేయడానికి గూడా ప్రయత్నించాను. కాని అది నా కంటే ఎక్కువ బలంగా వున్నది దాన్ని ఏమీ చేయలేక కాళ్ళు అప్పగించా నన్నాను. మొదట్లో అది నా ముఖం పొడవడ మారంభించింది. అది భరించలేక దానికి కాళ్ళు సమర్పించా' నన్నాను. నీ మాటలు వింటుంటే ఆశ్చర్యంగా వున్నది. అది ఒక్క గుండు దెబ్బకు చచ్చిపూరుకొంటుంది అన్నాడు ఆ పెద్దమనిషి నిజమా? అన్నాను నేను ఆ పని నీవు చేయగలవా? అని అడిగాను. ఎంతో సంతోషంగా చేస్తాను. అయితే ఇంటికిపోయి నేను తుపాకీ తీసుకొని రావాలి. ఒక్క అరగంట ఆగగలవా? అని అడిగాడు ఆ పెద్దమనిషి. చెప్పలేను. ఇప్పటికే బాధ భరించ లేకుండా వున్నాను. తొందరగా రండి అన్నాను. తొందరగా తుపాకీ తెస్తానన్నాడు ఆ పెద్దమనిషి. మా యీ సంభాషణ నంతా శాంతంగా విన్నది రాబందు. దానికి మా సంభాషణ అర్థమయిందని నేను గ్రహించాను. పూర్తిగా రెక్కలువిప్పి రాబందు కొంతదూరంగా పోయింది. అక్కడి నుండి బలంగా వేగంగా వచ్చి బల్లెంలాంటి తన ముక్కుతో నా నోట్లో పొడిచింది. ఆ పోటుకు నేను వెల్లకిలా పడిపోయాను. నారక్తంతో అది తడిసిపోతున్నట్లూ రక్తంలో మునిగిపోయినట్లూ తోచింది. ఆ రక్తం అన్ని లోతుల్నీ, అన్ని తీరాల్నీ ముంచివేసింది.

## 2. సహచరులు

మేము ఐదుగురం సహచరులం. ఒకరోజు మేమందరం ఒకరి తరువాత ఇంకొకరం ఇంట్లో నుండి బయటకు వచ్చాము. మొదటివాడు గేటుదగ్గర నిలబడ్డాడు.

అతని పక్కగా అందరం ఒక పంక్తిగా నిలబడ్డాము. జనం మమ్మల్ని గుర్తించారు. ఈ ఐదుగురూ ఒక్క ఇంట్లో నుండే వచ్చారన్నారు. మేమందరం ఆ యింట్లోనే వుండేవాళ్లం గదా!! ఆరోవాడు గూడా ఆ యింట్లో ప్రవేశించడానికి ప్రయత్నం చేయకపోతే మేము శాంతిగా నివసిస్తున్నట్లే లెఖ్ఖ. ఆరోవాడు ఆ యింట్లో ప్రవేశించడానికి ఎక్కువగా ప్రయత్నిస్తున్నాడు. అతని వల్ల మాకు కలిగే యిబ్బంది ఏమీ లేక పోయినా అతడు రావడం మాకు యిష్టం లేదు. అది తెలిసి గూడా అతడు లోపలికి రావలెనని ఎందుకు ప్రయత్నం చేస్తున్నట్లు? అతడెవరో మాకు తెలియదు. అతడు రావడం మాకు యిష్టం లేదు. మేము ఐదుగురం ఒకర్నొకరు ఎరిగివుండి ఇక్కడికి చేరలేదు. ఒకర్నొకరు అసలే ఎరగం. సర్దుకొని పోతున్నాం. ఈ కలిసి వుండడంలో గూడా ఏమీ అర్థం లేదు. ఐదుగురం వున్నాం. ఉంటున్నాం. మాకు కలిగిన అనుభవం అధారంగా ఆరోవాడు రావడం మాకేమాత్రం ఇష్టం లేదు. ఇదంతా ఆరో వాడికి వివరంగా చెప్పడ మట్లా? వాడితో చెప్పడం ఆరంభిస్తే అతణ్ణి మేము స్వీకరించి నట్లవుతుంది అందువల్ల అతనితో మాట్లాడము. అతణ్ణి మాలో చేర్చుకోము. అంతే. అయినా అతడు తన ప్రయత్నం మానడం లేదు మేము మోచేతులతో అతణ్ణి నెట్టిపారవేస్తున్నాము. తోసేస్తున్నాము. మేము ఎంత బయటికి నెట్టినా, ఎంత బయటికితోసినా అతడు లోపలికి వచ్చే ప్రయత్నం చేస్తూనే వున్నాడు.

## 3. ఎలుక-పిల్లి

ఎంత ఆశ్చర్యం! ఈ ప్రపంచం రోజురోజుకూ చిన్నదై పోతున్నది అన్నది ఎలుక. మొదట ఇదిఎంత విశాలంగా వున్నదంటే దాన్ని చూచి భయపడి నేను దానికి దూరంగా పరుగెత్తాను. చివరికి నాకు కుడిపక్కా ఎడమపక్కా గూడా పెద్ద పెద్ద గోడలు కనబడితే చూచి సంతోషించాను. ఆనందించాను. కాని కొద్దిసేపట్లోనే ఆ గోడలు ఎంత ఇరుకై పోయినవంటే నేను ఆ గది మూలలోకి చేరిపోవడం ప్రారంభమయింది. ఇరుకు ఎక్కువై ఎక్కువై కొద్దిసేపట్లో నేను ఆ మూలనున్న ఎలుకల బోనులో చిక్కుకోబోతున్నాను అన్నది ఎలుక. అక్కడే ఒక పిల్లి నిలబడి వున్నది. అది నన్ను చూసి నీవు మార్గం మార్చుకో అని ఉపదేశిస్తూనే నా మీదికి దూకింది. నన్ను చంపి మింగివేసింది.

## 4. ప్రయాణం

గుర్రపుశాల నుండి గుర్రాన్ని తీసుకొని రమ్మని నౌకరుకు ఆదేశించాను. నా ఆదేశం వాడికి అర్థం గాలేదు. నేనే గుర్రపుశాలకు వెళ్ళి గుర్రాన్ని సవారీకి తయారుచేసి దానిమీద ఎక్కి బయటకు వచ్చాను. దూరం నుండి ఏదో ఈల లాంటిది వినిపించింది. దానికి ఉద్దేశ్య మేమిటని అడిగాను. అతడి కది విన బడ్డట్టు లేదు. అదేమిటో అతనికి తెలియలేదు. గేటు దగ్గరకు చేరిన నన్ను ఆపి ఎక్కడికి వెళ్ళుతున్నారు? అని ప్రశ్నించాడు. నాకు తెలియ దన్నాను. అయితే ఇక్కడి నుండి చాలాదూరం పోతా నన్నాను పోయి పోయి గమ్యస్థానాన్ని చేరుకొంటా నన్నాను. గమ్యస్థానమేమిటో తెలుసా? అని అతడు తిరిగి ప్రశ్నించాడు. తెలుసు, ఇప్పుడే చెప్పివున్నాను కదా!! ఇక్కడి నుండి చాలా చాలా దూరం పోవడమే నా లక్ష్యమన్నాను. మీ దగ్గర తినుబండారాలేమీలేవు అన్నాడు నౌకరు. అవసరం లేదన్నాను. నా గమ్యం ఎంత దూరంలో వున్నదంటే నేను ఆకలికి బలి గావచ్చు నన్నాను. తినుబండారాలు నన్ను రక్షించలే వన్నాను. నా యాత్ర అంత గొప్పది గావడం నా అదృష్టం అన్నాను.

## 5. బొంగరం

ఒక వేదాంతి వుండేవాడు. ఎక్కడైనా పిల్లలు బొంగరా లాడుకుంటూ వుంటే అక్కడికి వెళ్ళి నిలబడేవాడు. బొంగరం నేల మీద పడి తిరగడం ప్రారంభం కాగానే దాన్ని పట్టుకునే ప్రయత్నం చేసేవాడు. అది పిల్లలకు నచ్చేది కాదు, వారు అతణ్ణి దూరంగా తోసివేయడానికి ప్రయత్నించేవాళ్ళు. అయినా బొంగరం నేలమీద తిరగడం ప్రారంభం కాగానే గభీమని బొంగరాన్ని పట్టుకొనేవాడు. అందుకు ఎంతో సంతోషించేవాడు. అయితే ఆ సంతోషం ఒక్క క్షణం మాత్రమే వుండేది. బొంగరాన్ని వదిలేసేవాడు. బొంగరం తిరగడం వంటి చిన్న చిన్న విషయాలను అర్థం చేసుకొంటే పెద్దపెద్ద విషయాలన్నీ కరతలామలకం కాగలవని అతని అభిప్రాయం. అందువలన పెద్ద పెద్ద విషయాల వైపుకు ఎప్పుడూ వెళ్ళేవాడుగాడు. బొంగరం తిరగడం లోని రహస్య మర్థమయితే అంతా అర్థమయినట్లే నని అతని నిశ్చితాభిప్రాయం, బొంగరం తిరగగానే ఊపిరంతా బిగబట్టి దాని చుట్టూ తిరిగేవాడు. దాన్ని పట్టుకునేవాడు కాని ఆ కర్రముక్క చేతిలోకి రాగానే అతడికి కక్కు వచ్చినంత పని అయ్యేది. పిల్లల అలజడి వినిపించేది కాదు కాని పిల్లల రణగొణ ధ్వని పెద్దదై అతని చెవుల్లోకి దూసుకుపోయేటంత పని జరిగితే కొరడా వూపు తగిలిన బొంగరం లాగానే తొట్రుపడుతూ వెళ్ళిపోయేవాడు.

# సాహిత్యగోష్ఠి

## ఎదరగిలించే గీతాలతో శ్రీ శ్రీ జడివాన

ఏదైనా గీతం - చేదైనా - మైమరపించేదైనా –మది కదిలించేదైనా ఎదరగిలించేదైనా ఏదైనా ఏదైనా ..." కల్లోలమయ జీవితంలో ఏదైనా గీతం వినిపించి మైమరపించాలి. చేదుదైనా ఫర్వాలేదు. అనేది 'ఏ' అనే విభాగానికి ప్రారంభం. జడి జడిగా కురిసే వర్షం నడి నెత్తిన రంపంలా మారుతోంది. ఆకాశం మాత్రం ప్రతి వాడికీ ఆవేశం చేకూరుస్తుంది ఉద్రేకంలో ఊగిస్తుంది. ఉద్వేగం రేగిస్తుంది.

దావానలమూ హాలాహలమూ ఉద్వేగానికి బాహ్యరూపాలుగా భాసిస్తాయి అవే కీలోజ్జ్వల కోటీరంగానూ రూపొందగలవు. నీలోత్పలాలతో నిండిన కాసార దర్శనం మనిషి హృదయంలో కేయూరాలను మెరిపిస్తుంది. ఏకాంత వాసంతో కిటికీలో కనిపించే ఏదో రూపం మాత్రం వాకిట ఆకస్మికంగా లేచిన ధూపంవలె జడిపిస్తుంది. గాలంలాగా, శూలంలాగా కాలం వ్రేలాడుతుంది. అది వేటాడే వ్యాఘ్రం వంటిది. శీఘ్రంగా వెంటాడుతూంటుంది. కాలానికి భయపడితే, ఫలశ్రుతి శోకమే! శోకం నైరాశ్యానికి దారి తీస్తుంది. అందుకే – 'కదిలేనా లోకం – దొరికేనా నాకం!' అనే పాదంతో మనిషి సమష్టి కృషి ఆశావహ భవిష్యత్తును సాధించగలదన్న సత్యాన్ని చాటుతాడు శ్రీశ్రీ!.

ప్రళయంలో పయనిస్తున్నా కనుపాపలే తెరచాపలుగా పురోగమించక తప్పదు. అప్పుడే విజయం సిద్ధిస్తుంది. "నిరయంలో శయనం - నిలయంలో విజయం'' అనే చివరి పాదాలలో నిరయం అనే సాధారణులకు అపరిచితమైన పదాన్ని ప్రయోగించాడు శ్రీశ్రీ. ప్రళయలో సమిష్టి మానవుడు సాగించే యాత్రలో నరకసదృశమైన దురవస్థలలోనే శయనించక తప్పదు అనే భావానికి, నిరయం అనే పదానికి మారుగా నరకం అనేపదం వాడినా ఛందో భంగం కలగదు. కాని నిరయంలో శయనం అనే పదాల పొహళింపు కలిగించే అనిర్వచనీయ ఓజస్సు సునాయాసంగా సాధ్యమవుతుంది.

"ఐక్యం అదీ మనకి ముఖ్యం'' అంటూ ప్రారంభమైన 'ఐ' విభాగం సమైక్యకృత్యం వల్ల సమసమాజం సాధించగలమనీ, విజయం సులభోపేత మవుతుందనీ కవితా పరిభాషలో ప్రకటిస్తాడు. "లేని పోని చీలికలు రెండు రెండు నాలుకలు ఛీ యిదా బతుక్కి. ఫాయిదా ?'' అంటూ శ్రీశ్రీ ఛీత్కరిస్తాడు. అవుగాముల సంశయ గాత్రాలలో, కర్తవ్యతా విమూఢ విషణ్ణవదనాలతో శ్రామిక వర్గం చీలిపోవడం వల్లనే స్వార్థపరులు బెఫరవాగా బ్రతుకున్నారు వ్యక్తులు బాహ్యదృష్టికి అనేకమే అయినా సంఘ ప్రయోజనం దృష్ట్యా ఏకం కావడమే వివేకం. అప్పుడే మానవ జాతికంతకీ విముక్తి కలిగించ గలుగుతారు శ్రామిక వర్గం నిస్సంగత్వానికి దారితీస్తే దుర్వాదాలన్నింటినీ నిభాయించుకుంటే తప్ప ప్రగతి సిద్ధించదు.

వర్తమాన కాలం మానవుల సమష్టి కృషి ముఖీనంగానే సాగుతోంది. ప్రపంచం ప్రస్తుతం సాధించిన నీతి – పురోగతి ఒక్కటే దానికి కారణం మానవ జాతి యావత్తూ అవిభక్తకుటుంబమే నన్న స్పృహ ఆధునిక కాలమే కలిగించింది. శ్రీశ్రీ ప్రయోగించే మానవ శబ్దానికి శ్రమైక జీవనులే నన్న దేరూఢ్యర్థం. మానవాకృతిగల సర్వులూనని కాదు. అప్పుడే – "వ్యక్తికి బహువచనం శక్తి'' అనే శ్రీశ్రీ ప్రఖ్యాత సూక్తి సార్ధకత నందుకుంటుంది.

ఐక్యంతో గమనం సాగిస్తే సామ్యవాద గమ్యానికి చేరుతుంది సమాజం వ్యర్థమైన స్పర్థలూ, స్వార్థపరుల కూటనీతులు కల్పించే యుద్ధాలూ సమసి పోతాయి. బ్రతుకే రమ్యతరమై ప్రకాశిస్తుంది. అందుకే సామాన్య మానవుల మధ్య ఐక్యం తక్షణ కర్తవ్యం! అప్పుడే మాట చేతగా

మారుతుంది. స్వప్నం సత్యంగా మెరుస్తుంది. సత్యం స్వర్గంగా వెలుస్తుంది.

'ఒ' అనే విభాగంలో ప్రాచీన మానవుల ఊహాపోహలు మన కథలకూ ఇతిహాసాలకూ డోలలుగా మారిన కాలాన్ని జ్ఞప్తికి తెస్తాడు శ్రీ శ్రీ. ఆ కాలం సమాజ జీవితానికి బాల్య దశ. అందుకే ఊహాజనిత కాల్పనికత ఉర్రట్లూగించింది. ఆ కాలంలో మొక్కలు చేతులెత్తి ప్రార్థనలు చేసేవన్నా, నక్కలు మాట్లాడేవన్నా, బాల్య హృదయం అమాయకంగా నిజమని నమ్మేది. కళలలోనూ, జీవితంలోనూ అరణ్యత్వం నిదర్శనంగా మిగిలి పోయింది. స్వాతంత్ర్యమనేది ఒకే సామూహిక సిద్ధి. అజ్ఞానం చీకటివంటిది; అది భయానికీ క్రౌర్యానికీ కూడా కాణాచి. అదే శిశుత్వమూ, పశుత్వమూను. ఈ పరిస్థితి పూర్తిగా మారాలి కాంతి ప్రసరించాలి శాస్త్రం ఎన్నడూ కళలపై శత్రుత్వం వహించదు. జనానీకంలో పాతుకుపోయిన భయాలన్నిటినీ పోకారుస్తుంది జ్ఞానం. మానవ సమాజం నేటి నుంచి రేపటికీ, చీకటి నుంచి వేకువలోకీ పరిణామం చెందడం తథ్యం. పావురం వంటి శాంతి మానవ జాతికి కానుకగా లభించక తప్పదు.

'ఓ' అనే తదుపరి భాగంలో పైన చెప్పిన కానుకగా లభించిన శాంతి పావురాన్ని సంబోధిస్తాడు కవి. ''ఓహో విహంగమా ఎగురు ఎగురు నీ రెక్కల విసరులో మన్వంతరాలు తరలు '' అంటూ ఆశా ప్రబుద్ధరేఖలు వెలారుస్తాడు. "ఓహో తరంగమా కదలు కదలు - నీ ముంచెత్తే వరదలలో నిమ్నోన్నతాలుకరగు! అంటూ ప్రదీప్తహృదయంతో భరోసా ప్రసరిస్తాడు. మృదంగాల సుస్వరాలతో నిరాశా దురాశా భాండాలన్నీ పగిలి పోగలవు. ముందుకు నడిచే జనాంగాల పరాంకోటి హస్తాలతో నూత్నగవాక్షాలు తెరచుకుంటాయి. అంటూ ముగిసిన ఈ ప్రకరణం యీ కావ్యానికీ ప్రాణధాతువు లందిస్తుంది.

'ఔ' అనే చరమ భాగంలో వర్తమాన శాస్త్రజ్ఞానం సాధించినవిజయాలు మానవ ప్రవర్తనలపై ఎలా ప్రభావం కలిగించాయో వివరిస్తాడు. "ఔను మన వాహనం మారింది· దూరానికి పూర్వపుటర్థం పోయింది. ఆసూర్య చంద్రులే యీ నాటికీ గతులు తప్పక వెలుగుతున్నా కాలం మాత్రం తన స్వరూపం మార్చుకుంది. అందుకే వర్తమాన మానవుడు పూర్ణజాగృతితో పరిస్థితులను కలయ జూడటమూ అవసరమైంది. పూర్వ వాహనమైన ఎద్దుల బండితో ప్రస్తుతం దూరాన్ని కొలిచి లాభం లేదు. చదల ఎదలు చీలుస్తూ ఎగరడం నేటి సహజ లక్షణం. వర్తమానం హస్తాలలోనికి భవిష్యత్తు వచ్చి వాలుతోంది. అందుక్క భూత కాలపు సరీసృపాలను పాతరాతి యుగంలో పారేయక తప్పదు.

ఇక్కడే'తోలెయ్ నీ మందాక్షాలని'' అంటాడు శ్రీశ్రీ; ఈ మందాక్షాలనే పదం శిష్టజనోప యోగం నుంచి తప్పుకొని మరుగున పడిపోయిందే. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప — అనే అర్థాలను బహుజనపల్లి సీతారామాచార్యులు యిచ్చారు. అంటే యుగాంతరాల నుంచి మానవులలో పేరుకొని వచ్చిన మొగ మాటాలన్నిటినీ ఛేదించుకోక తప్పదని శ్రీశ్రీ హెచ్చరిస్తున్నాడని అవగాహన చేసుకోవాలి.

"కాలం మరిగి పోతోంది. మానవుడిగా మేలుకో నేస్తం; ఏలుకో ఈవిశ్వం సమస్తం! అనే ఆత్మీయాహ్వానాన్ని కంఠోక్తిగా వినిపిస్తూ ఈకావ్యం ముగుస్తుంది. ఈవాక్యమే మంగళాశాసనంగా అమరుతోంది. ఈ కావ్యం 1968లో రచించబడ్డదని శ్రీ కె. వి. రమణారెడ్డి శ్రీ శ్రీ సాహిత్యం —కావ్య విభాగం మూడు (షష్టిపూర్తి సంపుటాలు)కు అధోజ్ఞాపికలో వివరించాడు. సామాన్యుని కామనతో కలిపి దీనిని చదువుకుంటే ఒక సంపూర్ణ కావ్యపఠనం అందించగల ఓజస్సు పాఠక హృదయానికి చేరుతోంది,

సోమసుందర్

## ఆధునిక కవిత – అన్వయ క్లిష్టత

ఆధునిక కవిత్వం అంటే — అభ్యుదయ కవితా యుగం తరువాత తెలుగులో వెలసిన వచన కవిత గురించే ప్రధానంగా ఆక్కడ పరిశీలించడం జరుగుతుంది. ఏదైనా ఒక కవిత అన్వయం కుదరక అర్థం కాకుండా ఉండడమన్నది ముఖ్యంగా మూడు విధాలుగా ఉంటుంది. ఒకటి శబ్దగతమైన అన్వయ క్లిష్టత. వ్యవహారంలోని మారు మూల పదాలను వాడడం వల్లనూ, కొన్ని పదములపై విపరీతమైన మోజు పెంచుకొని అవసరం లేనిచోట కూడా అతిగా ప్రయోగించడంవల్లనూ, శయ్యా సౌకుమార్యం కోసం మెత్తని శబ్దాల కూర్పుతో సుదీర్ఘమైన సంస్కృత సమాసాలను సాగదీస్తూ పోవడం వల్లనూ, అన్వయంకుదరక కవిత అర్థంకాకుండా

# సాహిత్యగోష్ఠి

## ఎదరగిలించే గీతాలతో శ్రీ శ్రీ జడివాన

ఏదైనా గీతం - చేదైనా - మైమరపించేదైనా -మది కదిలించేదైనా ఎదరగిలించేదైనా ఏదైనా ఏదైనా ..." కల్లోలమయ జీవితంలో ఏదైనా గీతం వినిపించి మైమరపించాలి. చేదుదైనా ఫర్వాలేదు. అనేది 'ఏ' అనే విభాగానికి ప్రారంభం. జడి జడిగా కురిసే వర్షం నడినెత్తిన రంపంలా మారుతోంది. ఆకాశం మాత్రం ప్రతి వాడికీ ఆవేశం చేకూరుస్తుంది ఉద్రేకంలో ఊగిస్తుంది. ఉద్వేగం రేగిస్తుంది.

దావానలమూ హాలాహలమూ ఉద్వేగానికి బాహ్యరూపాలుగా భాసిస్తాయి. అవే కిలోజ్జ్వల కోటీరంగానూ రూపొందగలవు. నీలోత్పలాలతో నిండిన కాసార దర్శనం మనిషి హృదయంలో కేయూరాలను మెరిపిస్తుంది. ఏకాంతవాసంతో కిటికీలో కనిపించే ఏదో రూపం మాత్రం వాకిట ఆకస్మికంగా లేచిన ధూపంవలె జడిపిస్తుంది. గాలంలాగా, శూలంలాగా కాలం వ్రేలాడుతుంది. అది వేటాడే వ్యాఘ్రం వంటిది. శీఘ్రంగా వెంటాడుతూంటుంది. కాలానికి భయపడితే, ఫలశ్రుతి శోకమే! శోకం నైరాశ్యానికి దారి తీస్తుంది. అందుకే – 'కదిలేనా లోకం – దొరికేనా నాకం!' అనే పాదంతో మనిషి సమష్టి కృషి ఆశావహ భవిష్యత్తును సాధించగలదన్న సత్యాన్ని చాటుతాడు శ్రీశ్రీ!.

ప్రళయంలో పయనిస్తున్నా కనుపాపలే తెరచాపలుగా పురోగమించక తప్పదు. అప్పుడే విజయం సిద్ధిస్తుంది. "నిరయంలో శయనం - నిలయంలో విజయం'' అనే చివరి పాదాలలో నిరయం అనే సాధారుణులకు అపరిచితమైన పదాన్ని ప్రయోగించాడు శ్రీశ్రీ. ప్రళయలో సమిష్టి మానవుడు సాగించే యాత్రలో నరకసదృశమైన దురవస్థలోనే శయనించక తప్పదు అనే భావానికి, నిరయం అనే పదానికి మారుగా నరకం అనేపదం వాడినా ఛందో భంగం కలగదు. కాని నిరయంలో శయనం అనే పదాల పోహళింపు కలిగించే అనిర్వచనీయ ఓజస్సు సునాయాసంగా సాధ్యమవుతుంది.

"ఐక్యం అదీ మనకి ముఖ్యం'' అంటూ ప్రారంభమైన 'ఐ' విభాగం సమైక్యకృత్యం వల్ల సమసమాజం సాధించగలమనీ, విజయం సులభోపేత మవుతుందనీ కవితా పరిభాషలో ప్రకటిస్తాడు. "లేని పోని చీలికలు రెండు రెండు నాలుకలు ఛీ యిదా బతుక్కి ఫాయిదా ?'' అంటూ శ్రీశ్రీ ఛీత్కరిస్తాడు. అవుగాముల సంశయ గాత్రాలలో, కర్తవ్యతా విమూఢ విషణ్ణవదనాలతో శ్రామిక వర్గం చీలిపోవడం వల్లనే స్వార్థపరులు బెఫరవాగా బ్రతుకున్నారు వ్యక్తులు బాహ్యదృష్టికి అనేకమే అయినా సంఘ ప్రయోజనం దృష్ట్యా ఏకం కావడమే వివేకం. అప్పుడే మానవ జాతికంతకీ విముక్తి కలిగించ గలుగుతారు శ్రామిక వర్గం నిస్సంగత్వానికి దారితీస్తే దుర్వాదాలన్నింటినీ నిభాయించుకుంటే తప్ప ప్రగతి సిద్ధించదు.

వర్తమాన కాలం మానవుల సమష్టి కృషి ముఖీనంగానే సాగుతోంది. ప్రపంచం ప్రస్తుతం సాధించిన నీతి – పురోగతి ఒక్కటే దానికి కారణం మానవ జాతి యావత్తూ అవిభక్తకుటుంబమే నన్న స్పృహ ఆధునిక కాలమే కలిగించింది. శ్రీశ్రీ ప్రయోగించే మానవ శబ్దానికి శ్రమైకజీవనులే నన్న దేరూఢ్యర్థం. మానవాకృతిగల సర్వులూనని కాదు. అప్పుడే – "వ్యక్తికి బహువచనం శక్తి'' అనే శ్రీశ్రీ ప్రఖ్యాత సూక్తి సార్థకత నందుకుంటుంది.

ఐక్యంతో గమనం సాగిస్తే సామ్యవాద గమ్యానికి చేరుతుంది సమాజం వ్యర్థమైన స్పర్థలూ, స్వార్థపరుల కూటనీతులు కల్పించే యుద్ధాలూ సమసి పోతాయి. బ్రతుకే రమ్యతరమై ప్రకాశిస్తుంది. అందుకే సామాన్య మానవుల మధ్య ఐక్యం తక్షణ కర్తవ్యం! అప్పుడే మాట చేతగా

మారుతుంది. స్వప్నం సత్యంగా మెరుస్తుంది. సత్యం స్వర్గంగా వెలుస్తుంది.

'ఒ' అనే విభాగంలో ప్రాచీన మానవుల ఊహాపోహలు మన కథలకూ ఇతిహాసాలకూ దోలలుగా మారిన కాలాన్ని జ్ఞప్తికి తెస్తాడు శ్రీశ్రీ. ఆ కాలం సమాజ జీవితానికి బాల్య దశ. అందుకే ఊహాజనిత కాల్పనికత ఉద్రబ్లాగించింది. ఆ కాలంలో మొక్కలు చేతులెత్తి ప్రార్థనలు చేసేవన్నా, నక్కలు మాట్లాడేవన్నా, బాల్య హృదయం అమాయకంగా నిజమని నమ్మేది. కళలలోనూ, జీవితంలోనూ అరణ్యా తత్త్వం నిదర్శనంగా మిగిలి పోయింది. స్వాతంత్ర్యమనేది ఒకే సామూహిక సిద్ధి. అజ్ఞానం చీకటివంటిది; అది భయా నికీ క్రౌర్యానికీ కూడా కాణాచి. అదే శిశుత్వమూ, పశుత్వ మూను. ఈ పరిస్థితి పూర్తిగా మారాలి కాంతి ప్రసరించాలి శాస్త్రం ఎన్నడూ కళలపై శత్రుత్వం వహించదు. జనానీ కంలో పాతుకుపోయిన భయాలన్నిటినీ పోకారుస్తుంది జ్ఞానం. మానవ సమాజం నేటి నుంచి రేపటికీ, చీకటి నుంచి వేకువలోకీ పరిణామం చెందడం తథ్యం. పావురం వంటి శాంతి మానవ జాతికి కానుకగా లభించక తప్పదు.

'ఓ' అనే తదుపరి భాగంలో పైన చెప్పిన కానుకగా లభించిన శాంతి పావురాన్ని సంబోధిస్తాడు కవి. ''ఓహో విహంగమా ఎగురు ఎగురు నీ రెక్కల విసరులో మన్వంత రాలు తరలు '' అంటూ ఆశా ప్రబుద్ధరేఖలు వెలారుస్తాడు. "ఓహో తరంగమా కదలు కదలు – నీ ముంచెత్తే వరద లలో నిమ్నోన్నతాలుకరగు! అంటూ ప్రదీప్తహృదయంతో భరోసా ప్రసరిస్తాడు. మృదంగాల సుస్వరాలలో నిరాశా దురాశా ఖాండాలన్నీ పగిలి పోగలవు. ముందుకు నడిచే జనాంగాల పరాంకోటి హస్తాలతో నూత్నగవాక్షాలు తెరచు కుంటాయి. అంటూ ముగిసిన ఈ ప్రకరణం యీ కావ్యానికీ ప్రాణధాతువు లందిస్తుంది.

'ఔ' అనే చరమ భాగంలో వర్తమాన శాస్త్రజ్ఞానం సాధించినవిజయాలు మానవ ప్రవర్తనలపై ఎలా ప్రభావం కలిగించాయో వివరిస్తాడు. "ఔను మన వాహనం మా రింది. దూరానికి పూర్వపుటర్థం పోయింది. అసూర్య చంద్రులే యీ నాటికీ గతులు తప్పక వెలుగుతున్నా కాలం మాత్రం తన స్వరూపం మార్చుకుంది. అందుకే వర్తమాన మానవుడు పూర్ణజాగృతితో పరిస్థితులను కలయ జూడ టమూ అవసరమైంది. పూర్వ వాహనమైన ఎద్దుల బండితో ప్రస్తుతం దూరాన్ని కొలిచి లాభం లేదు. చదల ఎదలు చీలుస్తూ ఎగరడం నేటి సహజ లక్షణం. వర్తమానం హస్తాలలోనికి భవిష్యత్తు వచ్చి వాలుతోంది. అందుకే భూత కాలపు సరీసృపాలను పాతరాతి యుగంలో పారేయక తప్పదు.

ఇక్కడే'తోలెయ్ నీ మందాక్షాలని'' అంటాడు శ్రీశ్రీ; ఈ మందాక్షాలనే పదం శిష్టజనోప యోగం నుంచి తప్పు కొని మరుగున పడిపోయిందే. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప – అనే అర్థాలను బహుజనపల్లి సీతారామాచార్యులు యిచ్చారు. అంటే యుగాంతరాల నుంచి మానవులలో పేరుకొని వచ్చిన మొగ మాటాలన్నిటినీ ఛేదించుకోక తప్పదని శ్రీశ్రీ హెచ్చరిస్తున్నాడని అవగాహన చేసుకోవాలి.

"కాలం మరిగి పోతోంది. మానవుడిగా మేలుకో నేస్తం; ఏలుకో ఈవిశ్వం సమస్తం! అనే ఆత్మీయాహ్వానాన్ని కంఠోక్తిగా వినిపిస్తూ ఈకావ్యం ముగుస్తుంది. ఈవాక్యమే మంగళాశాసనంగా అమరుతోంది. ఈ కావ్యం 1966లో రచించబడ్డదని శ్రీ కె. వి. రమణారెడ్డి శ్రీ శ్రీ సాహిత్యం —కావ్య విభాగం మూడు (షష్టిపూర్తి సంపుటాలు)కు అధో జ్ఞాపికలో వివరించాడు. సామాన్యుని కామనతో కలిపి దీనిని చదువుకుంటే ఒక సంపూర్ణ కావ్యపఠనం అందించగల ఓజస్సు పాఠక హృదయానికి చేరుతోంది,

సోమసుందర్

# ఆధునిక కవిత – అన్వయ క్లిష్టత

ఆధునిక కవిత్వం అంటే – అభ్యుదయ కవితా యుగం తరువాత తెలుగులో వెలసిన వచన కవిత గురించే ప్రధా నంగా అక్కడ పరిశీలించడం జరుగుతుంది. ఏదైనా ఒక కవిత అన్వయం కుదరక అర్థం కాకుండా ఉండడమన్నది ముఖ్యంగా మూడు విధాలుగా ఉంటుంది. ఒకటి శబ్దగతమైన అన్వయ క్లిష్టత. వ్యవహారంలోని మారు మూల పదాలను వాడడం వల్లనూ, కొన్ని పదములపై విపరీతమైన మోజు పెంచుకొని అవసరం లేనిచోట కూడా అతిగా ప్రయోగిం చడంవల్లనూ, శయ్యా సౌకుమార్యం కోసం మెత్తని శబ్దాల కూర్పుతో సుదీర్ఘమైన సంస్కృత సమాసాలను సాగదీస్తూ పోవడం వల్లనూ, అన్వయంకుదరక కవిత అర్థంకాకుండా

# సాహిత్యగోష్ఠి

## ఎదరగిలించే గీతాలతో శ్రీ శ్రీ జడివాన

ఏదైనా గీతం - చేదైనా - మైమరపించేదైనా -మది కదిలించేదైనా ఎదరగిలించేదైనా ఏదైనా ఏదైనా ..." కల్లోలమయ జీవితంలో ఏదైనా గీతం వినిపించి మైమరపించాలి. చేదుదైనా ఫర్వాలేదు. అనేది 'ఏ' అనే విభాగానికి ప్రారంభం. జడి జడిగా కురిసే వర్షం నడి నెత్తిన రంపంలా మారుతోంది. ఆకాశం మాత్రం ప్రతి వాడికీ ఆవేశం చేకూరుస్తుంది ఉద్రేకంలో ఊగిస్తుంది. ఉద్వేగం రేగిస్తుంది.

దావానలమూ హాలాహలమూ ఉద్వేగానికి బాహ్యరూపాలుగా భాసిస్తాయి అవే కీలోజ్జ్వల కోటీరంగానూ రూపొందగలవు. నీలోత్పలాలతో నిండిన కాసార దర్శనం మనిషి హృదయంలో కేయూరాలను మెరిపిస్తుంది. ఏకాంత వాసంలో కిటికీలో కనిపించే ఏదో రూపం మాత్రం వాకిట ఆకస్మికంగా లేచిన ధూపంవలె జడిపిస్తుంది. గాలంలాగా, శూలంలాగా కాలం వ్రేలాడుతుంది. అది వేటాడే వ్యాఘ్రం వంటిది. శీఘ్రంగా వెంటాడుతూంటుంది. కాలానికి భయపడితే, ఫలశ్రుతి శోకమే! శోకం నైరాశ్యానికి దారి తీస్తుంది. అందుకే – 'కదిలేనా లోకం – దొరికేనా నాకం!' అనే పాదంతో మనిషి సమష్టి కృషి ఆశావహ భవిష్యత్తును సాధించగలదన్న సత్యాన్ని చాటుతాడు శ్రీశ్రీ!.

ప్రళయంలో పయనిస్తున్నా కనుపాపలే తెరచాపలుగా పురోగమించక తప్పదు. అప్పుడే విజయం సిద్ధిస్తుంది. "నిరయంలో శయనం - నిలయంలో విజయం'' అనే చివరి పాదాలలో నిరయం అనే సాధారణులకు అపరిచితమైన పదాన్ని ప్రయోగించాడు శ్రీశ్రీ. ప్రళయలో సమిష్టి మానవుడు సాగించే యాత్రలో నరకసదృశమైన దురవస్థలలోనే శయనించక తప్పదు అనే భావానికి, నిరయం అనే పదానికి మారుగా నరకం అనేపదం వాడినా ఛందో భంగం కలగదు. కాని నిరయంలో శయనం అనే పదాం పోహళింపు కలిగించే అనిర్వచనీయ ఓజస్సు సునాయాసంగా సాధ్యమవుతుంది.

"ఐక్యం అదీ మనకి ముఖ్యం'' అంటూ ప్రారంభమైన 'ఐ' విభాగం సమైక్యకృత్యం వల్ల సమసమాజం సాధించగలమనీ, విజయం సులభోపేత మవుతుందనీ కవితా పరిభాషలో ప్రకటిస్తాడు. "లేని పోని చీలికలు రెండు రెండు నాలుకలు ఛీ యిదా బతుక్కా. పాయిదా ?'' అంటూ శ్రీశ్రీ ఛీత్కరిస్తాడు. అవుగాముల సంశయ గాత్రాలలో, కర్తవ్యతా విమూఢ విషణ్ణవదనాలతో శ్రామిక వర్గం చీలిపోవడం వల్లనే స్వార్థపరులు బెఫరవాగా బ్రతుకున్నారు వ్యక్తులు బాహ్యదృష్టికి అనేకమే అయినా సంఘ ప్రయోజనం దృష్ట్యా ఏకం కావడమే వివేకం. అప్పుడే మానవ జాతికంతకీ విముక్తి కలిగించ గలుగుతారు శ్రామిక వర్గం నిస్సంగత్వానికి దారితీస్తే దుర్వాదాలన్నింటినీ నిభాయించుకుంటే తప్ప ప్రగతి సిద్ధించదు.

వర్తమాన కాలం మానవుల సమష్టి కృషి ముఖీనంగానే సాగుతోంది. ప్రపంచం ప్రస్తుతం సాధించిన నీతి – పురోగతి ఒక్కటే దానికి కారణం మానవ జాతి యావత్తూ అవిభక్తకుటుంబమే నన్న స్పృహ ఆధునిక కాలమే కలిగించింది. శ్రీశ్రీ ప్రయోగించే మానవ శబ్దానికి శ్రమైక జీవనులే నన్న దేరూఢ్యర్థం. మానవాకృతిగల సర్వులూనని కాదు. అప్పుడే – "వ్యక్తికి బహువచనం శక్తి'' అనే శ్రీశ్రీ ప్రఖ్యాత సూక్తి సార్థకత నందుకుంటుంది.

ఐక్యంతో గమనం సాగిస్తే సామ్యవాద గమ్యానికి చేరుతుంది సమాజం వ్యర్థమైన స్పర్థలూ, స్వార్థపరుల కూటనీతులు కల్పించే యుద్ధాలూ సమసి పోతాయి. బ్రతుకే రమ్యతరమై ప్రకాశిస్తుంది. అందుకే సామాన్య మానవుల మధ్య ఐక్యం తక్షణ కర్తవ్యం! అప్పుడే మాట చేతగా

మారుతుంది. స్వప్నం సత్యంగా మెరుస్తుంది. సత్యం స్వర్గంగా వెలుస్తుంది.

'ఒ' అనే విభాగంలో ప్రాచీన మానవుల ఊహాపోహలు మన కథలకూ ఇతిహాసాలకూ డోలలుగా మారిన కాలాన్ని జ్ఞప్తికి తెస్తాడు శ్రీ శ్రీ. ఆ కాలం సమాజ జీవితానికి బాల్య దశ. అందుకే ఊహాజనిత కాల్పనికత ఉద్రల్లాగించింది. ఆ కాలంలో మొక్కలు చేతులెత్తి ప్రార్థనలు చేసేవన్నా, నక్కలు మాట్లాడేవన్నా బాల్య హృదయం అమాయకంగా నిజమని నమ్మేది. కళలలోనూ, జీవితంలోనూ అరణ్య తత్త్వం నిదర్శనంగా మిగిలి పోయింది. స్వాతంత్ర్యమనేది ఒకే సామూహిక సిద్ధి. అజ్ఞానం చీకటివంటిది; అది భయానికీ క్రౌర్యానికీ కూడా కాణాచి. అదే శిశుత్వమూ, పశుత్వమూను. ఈ పరిస్థితి పూర్తిగా మారాలి కాంతి ప్రసరించాలి శాస్త్రం ఎన్నడూ కళలపై శత్రుత్వం వహించదు. జనానీకంలో పాతుకుపోయిన భయాలన్నిటినీ పోకారుస్తుంది జ్ఞానం. మానవ సమాజం నేటి నుంచి రేపటికీ, చీకటి నుంచి వేకువలోకీ పరిణామం చెందడం తథ్యం. పావురం వంటి శాంతి మానవ జాతికి కానుకగా లభించక తప్పదు.

'ఓ' అనే తదుపరి భాగంలో పైన చెప్పిన కానుకగా లభించిన శాంతి పావురాన్ని సంబోధిస్తాడు కవి. ''ఓహో విహంగమా ఎగురు ఎగురు నీ రెక్కల విసరులో మన్వంతరాలు తరలు '' అంటూ ఆశా ప్రబుద్ధరేఖలు వెలారుస్తాడు. "ఓహో తరంగమా కదలు కదలు - నీ ముంచెత్తే వరదలలో నిమ్నోన్నతాలుకరగు! అంటూ ప్రదీప్తహృదయంతో భరోసా ప్రసరిస్తాడు. మృదంగాల సుస్వరాలలో నిరాశా దురాశా ఖాండాలన్నీ పగిలి పోగలవు. ముందుకు నడిచే జనాంగాల పరాంకోటి హస్తాలతో నూత్నగవాక్షాలు తెరచుకుంటాయి. అంటూ ముగిసిన ఈ ప్రకరణం యీ కావ్యానికీ ప్రాణధాతువు లందిస్తుంది.

'ఔ' అనే చరమ భాగంలో వర్తమాన శాస్త్రజ్ఞానం సాధించినవిజయాలు మానవ ప్రవర్తనలపై ఎలా ప్రభావం కలిగించాయో వివరిస్తాడు. "ఔను మన వాహనం మారింది. దూరానికి పూర్వపుటర్థం పోయింది. ఆసూర్య చంద్రులే యీ నాటికీ గతులు తప్పక వెలుగుతున్నా కాలం మాత్రం తన స్వరూపం మార్చుకుంది. అందుకే వర్తమాన మానవుడు పూర్ణజాగృతితో పరిస్థితులను కలయ జూడటమూ అవసరమైంది. పూర్వ వాహనమైన ఎద్దుల బండితో ప్రస్తుతం దూరాన్ని కొలిచి లాభం లేదు. చదల ఎదలు చీలుస్తూ ఎగరడం నేటి సహజ లక్షణం. వర్తమానం హస్తాలలోనికి భవిష్యత్తు వచ్చి వాలుతోంది. అందుక్కే భూత కాలపు సరీసృపాలను పాతరాతి యుగంలో పారేయక తప్పదు.

ఇక్కడే'తోలెయ్ నీ మందాక్షాలని'' అంటాడు శ్రీశ్రీ; ఈ మందాక్షాలనే పదం శిష్టజనోప యోగం నుంచి తప్పుకొని మరుగున పడిపోయిందే. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప - అనే అర్థాలను బహుజనపల్లి సీతారామాచార్యులు యిచ్చారు. అంటే యుగాంతరాల నుంచి మానవులలో పేరుకొని వచ్చిన మొగ మాటాలన్నిటినీ ఛేదించుకోక తప్పదని శ్రీశ్రీ హెచ్చరిస్తున్నాడని అవగాహన చేసుకోవాలి.

"కాలం మరిగి పోతోంది. మానవుడిగా మేలుకో నేస్తం; ఏలుకో ఈవిశ్వం సమస్తం! అనే ఆత్మీయాహ్వానాన్ని కంఠోక్తిగా వినిపిస్తూ ఈకావ్యం ముగుస్తుంది. ఈవాక్యమే మంగళాశాసనంగా అమరుతోంది. ఈ కావ్యం 1985లో రచించబడ్డదని శ్రీ కె. వి. రమణారెడ్డి శ్రీ శ్రీ సాహిత్యం -కావ్య విభాగం మూడు (షష్టిపూర్తి సంపుటాలు)కు అధో జ్ఞాపికలో వివరించాడు. సామాన్యుని కామనతో కలిపి దీనిని చదువుకుంటే ఒక సంపూర్ణ కావ్యపఠనం అందించగల ఓజస్సు పాఠక హృదయానికి చేరుతోంది.

సోమసుందర్

# ఆధునిక కవిత - అన్వయ క్లిష్టత

ఆధునిక కవిత్వం అంటే - అభ్యుదయ కవితా యుగం తరువాత తెలుగులో వెలసిన వచన కవిత గురించే ప్రధానంగా అక్కడ పరిశీలించడం జరుగుతుంది. ఏదైనా ఒక కవిత అన్వయం కుదరక అర్థం కాకుండా ఉండడమన్నది ముఖ్యంగా మూడు విధాలుగా ఉంటుంది. ఒకటి శబ్దగతమైన అన్వయ క్లిష్టత. వ్యవహారంలోని మారు మూల పదాలను వాడడం వల్లనూ, కొన్ని పదములపై విపరీతమైన మోజు పెంచుకొని అవసరం లేనిచోట కూడా అతిగా ప్రయోగించడంవల్లనూ, శయ్యా సౌకుమార్యం కోసం మెత్తని శబ్దాల కూర్పుతో సుదీర్ఘమైన సంస్కృత సమాసాలను సాగదీస్తూ పోవడం వల్లనూ, అన్వయంకుదరక కవిత అర్థంకాకుండా

పోతుంది. ఇక్కడ శబ్దార్థ పరిజ్ఞానంకోసం నిఘంటువులను ఆశ్రయిస్తే సరిపోతుంది. లేదా సంస్కృత సమాసాలైతే ప్రకరణాన్ని బట్టి విగ్రహం చెప్పగలిగిన విషయ పరిజ్ఞానమూ సందర్భ ఔచిత్యమూ ఉండాలి. ఆ భాషలోని కాకువూ తెలుసుకుంటేసరి కవిత సుగమమవుతుంది. ఇట్లా సామాన్యమైన కావ్యభాషా పరిచయంతో మనం ప్రాచీన కావ్యాల్ని అధ్యయనం చేయగలుగుతున్నాం. శబ్దగతమైన అన్వయ క్లిష్టతకు అక్కడ తావులేదు. కాని ప్రబంధ సాహిత్యంలోనూ, దాని తరువాత వచ్చిన యుగంలోనూ బంధ, గర్భ, శ్లేష కవిత్వాదుల వంటి చిత్ర విచిత్రాలైన సర్కస్ ఫీట్ల అనుచిత ప్రవేశంవల్ల కొంతక్లిష్టత ఏర్పడిన మాట నిజం. క్షీణ యుగంలోని అల్ప ప్రతిభులైన కవులు శబ్దాన్ని వైచిత్రి కోసం వాడుకున్నారు. ఆ తరువాత వచ్చిన భావకవులు కవితలో శయ్యా మార్దవాన్ని సాధించడం కోసం కుసుమకోమల సదృశమైన శబ్ద పరంపరను పేర్చుకుంటూ పోవటంవల్ల అనన్వయతకు దారి తీసింది. వీళ్ళ చూపు ఎప్పుడూ శబ్దం నుండి సౌందర్యాన్ని పిండడం మీదనే. అందుకే అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు ఇలాంటి వ్యర్థపద సముదాయానికి "దండగ గణములూ" "గుంపు గణములూ" "భూమి గణములూ" అని పేర్లు పెట్టినాడు. అన్వయం కుదరని భాగాలను "పులుముడు" కింద జమకట్టినాడు. ఆ తరువాత అభ్యుదయ కవితా యుగంలోని ప్రయోగ వాదులు వైచిత్రి వైచిత్రి కోసమే అన్నంతగా శబ్ద స్వరూపాన్ని వికృతం చేసి అర్థాన్ని అధ్వాన్నపుటడవిలో వదలివేసినారు. కాని ప్రగతి వాదులు మాత్రం వినూత్న శబ్ద ప్రయోగ దక్షతను వీర, రౌద్ర రసావిష్కరణకు సమర్థంగా వాడుకున్నారు. వీళ్లలో శబ్దగతమైన అన్వయ క్లిష్టత లేదనే చెప్పవచ్చును. ఇటీవల వచన కవితా ప్రక్రియలో వస్తున్న కావ్యాల్లో శబ్దాన్ని ఆశ్రయించి చేసే గారడి గమ్మత్తులు అంతగా లేకపోవడం శుభ సూచకం.

రెండవది వస్తుగతమైన అన్వయ క్లిష్టత. కావ్యంలో వస్తువు అతి గంభీరమై ఆధ్యాత్మిక వేదాంత సంబంధమైనప్పుడుగానీ, మార్మిక స్వభావం కలిగి ఉన్నప్పుడు గానీ, సృష్టి స్వభావాన్ని విశ్లేషిస్తూ తాత్వికతను ప్రదర్శించినప్పుడుగానీ, శాస్త్రీయ దృక్పథానికి ప్రాముఖ్యం పెరిగినప్పుడుగానీ 'కవిత అర్థంకాకుండాపోయే ప్రమాదమున్నది ప్రాచీన కావ్యాల్లో ఆధ్యాత్మిక వేదాంత పరమైన అర్థక క్లిష్టత మాత్రమే అక్కడక్కడా కనిపిస్తుంటుంది భావ కవిత్వంలో మార్మికతవల్ల అనన్వయత కొందరి కావ్యాల్లో మాత్రమే చోటు చేసుకున్నది. ఇటీవల వస్తున్న వచన కవితలో శాస్త్రీయ దృక్పథమూ, తాత్విక ధోరణీ, మానవ మనస్స్వభావ పరిశీలనా దృష్టీ, సామాజిక సిద్ధాంత ప్రవక్తృతా ప్రియత్వమూ, విదేశాల నుండి వచ్చే ఆధునిక శాస్త్రాల పైపై అధ్యయనం వల్ల సమకూరే భావశబలతా మొదలైన భావ సాంకర్యం ప్రవేశించి కవిత్వానికి అనన్వయతను కలిగిస్తున్నాయి. అత్యంత వేగవంతంగా మారుతున్న నేటి నాగరక ప్రపంచంలో విలువలు తారుమారవుతున్నాయి ఇవ్వాళ అత్యంత ఆదరాన్నీ జనామోదాన్నీ పొందిన సిద్ధాంతం రేపటికి పాతబడితిరస్కరింపబడుతున్నది ఆర్థిక రాజకీయాది రంగాల్లో పుట్టుకవస్తున్న అతినవీన సిద్ధాంతాలు మారురూపాలతో సాహిత్యంలో ప్రవేశించి దాని విరాట్ స్వరూపాన్ని వికృతంచేసి అయోమయాన్ని సృష్టిస్తున్నాయి. విజ్ఞాన శాస్త్రపుటంచులు క్షణక్షణంవిస్తృతమవుతున్నాయి. ఈ సంక్షుబ్ధ వాతావరణం భూమికగా మానవ మస్తిష్కంలో ఆ వర్తాలు చెలరేగి మనిషి హృదయం కల్లోల కడలిలా మారుతున్నది. ఈ సామాజిక వాస్తవికత సాహిత్యంలోనూ ప్రతి ఫలిస్తున్నది. అందువల్లనేటి ఆధునిక కవిత్వంలో ఎక్కువ భాగం బౌద్ధిక స్వభావాన్ని సంతరించుకొని మేధస్సును ఆశ్రయిన్నది. ఈ కవిత హృదయం నుండి దూరమవుతూ క్రమంగా మెదడుకు సన్నిహితమవుతున్న కొద్దీ అన్వయ కాఠిన్యం పెరుగుతూ పోతున్నది కవి చెప్పదలచుకున్న విషయం పాఠకునికి ఎప్పుడూ అచుంబితంగానే ఉంటున్నది. ఇది కవితకు అనర్థదాయకం.

ఇక మూడవది — అభివ్యక్తికి సంబంధించిన అన్వయ క్లిష్టత. ఈ అభివ్యక్తి ఆధునిక కవిత్వంలో అత్యంత ప్రధానమైంది. ఆధునిక కవిత్వ వైలక్షణ్యాన్ని నిలబెట్టుతున్నదీ ఇదే. అన్వయక్లిష్టతకు ఎక్కువగా ఆకరమైంది కూడా ఇదే. ఆధునిక కవులంతా అభివ్యక్తిలో నవ్యత కోసం సరికొత్త ప్రయోగాలు చేస్తున్నారు. దానికోసం నిరంతరాన్వేషణ సాగిస్తున్నారు ప్రయోగవాదుల్లో ఈ లక్షణం మరీ ఎక్కువ. ఈనాడు వచన కవితా మార్గంలో రాస్తున్న సుప్రసిద్ధకవుల అభివ్యక్తిలో ఎంతో వైవిధ్యం కనిపిస్తున్నది. నూతన పద బంధాలతో, భావచిత్రాలతో, ఉక్తి వైచిత్రితో వినూత్న ప్రతీకలతో, సరికొత్త ఆలంకారిక సామగ్రితో ఆధునిక కవులు భావతీవ్రతను సాధించడంలో నైతే నేమి, అనుభూతులకు పదును పెట్టి వ్యక్తం

చేయడంలో నైతేనేమి ఒకరితో మరొకరుపోటీపడుతున్నారు ఈ యుగంలో వచ్చిన 'తెలంగాణా' 'పునర్నవమ్' 'సినీ వాలి' 'అమృతం కురిసిన రాత్రి' 'నాదేశం నా ప్రజలు' 'విశ్వంభర' వంటి కావ్యాల్లో ఆయా కవులు ఆధునిక వస్తు భావాల్ని అధునికంగా మలిచి ఆధునిక అభివ్యక్తికి ప్రాణం పోసినారు. ఐతే ఇలాంటి ప్రయత్నాలు చేసిన వాళ్ళ సంఖ్య చాలా తక్కువగా కనిపిస్తున్నది. ఈ తరంలో పేరు మోసిన చాలా మంది కవులు అభివ్యక్తి నవ్యత కోసం చేస్తున్న ప్రయోగాలు. వాళ్ళ వైయక్తిక పరిధిని దాటి రావడం లేదు. వాళ్ళ కవితలు పాఠకుని హృదయతం త్రుల్ని సుతారంగా మీటడానికి మారుగా అన్వయం కుదరని రీతిలో వరుసగా పేర్చిన కావ్యాల గుంపులుగా తయారవు తున్నాయి. విడివిడిగా రెండు కావ్యాలకు ఏదో అర్థం చెప్పు కున్నా – ఆ రెండు వాక్యాలకూ పరస్పరం సమన్వయం కుదరని కవితార్థం బోధపడకుండా పోతున్నది. కవి ఎన్ను కుంటున్న ప్రతీకలు పాఠకుల అనుభూతికి చిక్కడంలేదు. కవి స్వయంగా తన కవితకుతానే వ్యాఖ్యాతగా మారితే తప్ప కవి లక్షించిన భావస్ఫూర్తి కలగడం లేదు. కొందరి శక్తి చమత్కారాలు మసక మసక చీకట్లో లేని వస్తువుల కోసం తడుముకున్నట్లుగానే ఉంటున్నాయి. తరచుగా వాడ బడుతున్న ఉపమ, రూప కాలంకారాల గజిబిజితో భావం రూపుకట్టక కవిత పజిల్స్ లాగా తయారవుతున్నది.

ఈ విధంగా అభివ్యక్తికి సంబంధించిన అన్వయ క్లిష్ట తను మళ్ళీ ఆరు రకాలుగా విభజించవచ్చు. అవి —

(1) ఉక్తివైచిత్రిలో అర్థగాంభీర్యం లోపించడం వల్లనూ

(2) భావ చిత్రాలకు పరస్పర అర్థసాంగత్యం లేక పోవడం వల్లనూ.

(3) కావ్యార్థ స్ఫూర్తికి సహకరించని వాక్య సముదాయం వల్లనూ.

(4) సాహిత్య సాంప్రదాయంలో ఇముడని ప్రతీకల బాహుళ్యం వల్లనూ.

(5) మార్మికతతో కూడిన తత్వచింతన వల్లనూ.

(6) అసమర్థములైన ఆలంకారిక పద ప్రయోగం వల్లనూ.

అవ్యక్తి మార్గంలో ఆరు రకాలుగా అన్వయ క్లిష్టత ఏర్పడుతున్నది.

అంతేకాక కథారహితమైన వస్తు విన్యాసంగానూ, వస్తు వైవిధ్యం లేకుండానూ, ఆత్మాశ్రయంగానూ, వైయక్తిక అనుభూతులకు సార్వ జనీనత సంక్రమించక పోవడం వల్లనూ ఈ ఆధునిక కవిత అన్వయ క్లిష్టతకు గురవు తున్నది. తెలుగు సాహిత్య మర్యాదకూ, దాని నుడికారా నికి అనుకూలంగా లేని, వైదేశిక సాహిత్య ధోరణులచేత ఆధునిక కవులు ప్రభావితం కావడం కూడా ఒక కారణంగా చెప్పవచ్చు. అందుకే ఇలాంటి తెలుగు కవుల్ని మనసులో పెట్టుకొని కుందుర్తి తన "నగరంలో వాన" కావ్యానికి ముందు మాటలు రాస్తూ ఈ విధంగా అంటాడు — "దీనికి ప్రధాన కారణం సర్రియలిజం, సింబా లిజం, ఎగ్జిస్టెన్షి యాలిజం, క్యూబిజం, డాడాయిజం మొదలగు పాశ్చాత్య కవితోద్య మాలపట్ల గల వ్యామోహమేనని నా నమ్మకం. పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లున్నట్లు బీట్స్ యాంగ్రీ యంగ్‌మేన్, మొదలగు ఉద్యమాలను అనుక రించ వలెననే అభిలాష కూడా ఎక్కువవుతూ ఉన్నది, ఆంగ్ల భాష పుణ్యమా అని ఆధునిక కవుల్లో వచ్చిన అంత ర్జాతీయ భావనా చైతన్యము వల్ల లాభించుట పోయి నష్ట పడుతున్నామా అనిపించేటంత ఎక్కువగా వికృతత్వము. కృతకత్వము కవితలో వ్యాపిస్తున్నవి................ ప్రయోగాలు చేయటం మరేమి పనిలేకకాదు. క్రొత్తను సృష్టించడానికి కోతివలె చిందులు త్రొక్కనవసరము లేదు'' ఇట్లా కుందుర్తి ఖండితంగానే ఉన్నమాట చెప్పినాడు. అంతే కాక దేవరకొండ బాల గంగాధరతిలక్ తన "నవత-కవిత'' అనే కవితా ఖండికలో ఈ విధంగా అంటున్నాడు —

'' మిత్రమా!
కవిత ఉన్నప్పుడే నవత రాణిస్తుంది
అసలు కవితలోనే నవతకూడా ఉంది
కాని మోడరన్‌గా ఉందామని, ఏదో అందామని
తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని
అర్థంలేని ఇమేజరీకలగాపులగపు వర్ణనలతో
డిలాన్ థామన్‌కు చేతకాని అనుకరణతో
ఒకదేశం నిర్దేశంలేని వాక్యాల వికారంతో
ఎందుకు బాధిస్తావు నన్ను, బాధపడుతావు నువ్వు

కవిత్వములో అబ్స్క్యూరిటీ కొన్ని సందర్భాలలో
ఉండొచ్చును
కాని పాఠకుడికి అనుభూతి ఆకారం హత్తుకోవాలి
అది ట్రాన్స్‌పరెంట్ చీకటైఉండాలి నిన్ను పలకరించాలి
కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరువాలి

కదలించాలి''

అంటూ తిలక్ ఆధునిక కవుల్ని హెచ్చరించినాడు, మనమూ అలాంటి ఉత్తమ కవిత్వంకోసం వేచిచూద్దాం
(ఆలిండియా రేడియో - హైదరాబాదు వారి సౌజన్యంతో)

పేర్వారం జగన్నాథం
1-705/5-1-C
మిథిలానగర్
హనుమకొండ, జి॥ వరంగలు

\+ \+ \+

# నన్నయ ఆదికవి కాదా?

ఇటీవల రాజమహేంద్రవరమున నన్నయ భట్టారకుని జయంతి మహోత్సవములు జరుపబడుచుండగా కొన్ని పత్రికలలో నన్నయ భట్టారకులు ఆదికవి ఔనా? కాదా అను చర్చలు జరుగుచుండుట- ఆంధ్రేతరులకు వింతగా దోచునేమోగాని-ఆంధ్రులకు అనాదిగా ఆనూచానముగ సంక్రమించిన అలవాటే గనుక వింతగా దోపదు పరభాషాకవుల ప్రస్తుతి స్వభాషాకవులపై నిందారోపణలు -ఆంధ్రజాతికే క్రొత్త విషయముగ కానరాదు.

అల్లిబిల్లిగా అల్లుకు పోయిన ఆంధ్ర భాషావల్లరిని చిక్కుదీసి చేరదీసి చక్కనైన సాహిత్యస్థాయి నందించిన ఘనులు వాగనుశాసనులు నన్నయభట్టారకులు. ఆంధ్ర వాఙ్మయమున ఉపలభ్యమానమగుచున్న గ్రంథములలో నన్నయ భట్టారకులాంధ్రీకరించిన 'మహాభారతము' మొట్ట మొదటిది. నన్నయకు పూర్వము ఆంధ్రవాఙ్మయ స్వరూప మిట్లుండెనని ఖచ్చితముగా తేల్చిచెప్పుట కష్టము. ప్రాఙ్నన్నయయుగములో ప్రధానముగ శాసనములుబయలెడిలినవి అవియును ఆనాటి భాషా దేశీయ ఛ్ఛంద స్వరూపనికే రూపణ ఎక్కువగా సాయపడును గాని వాఙ్మయస్థితిని విపులంగా గ్రహించుటకు వలను పడదు.

వాఙ్మయమనగ ఒకజాతి జనులు తమభాషలో వెలయించిన యుత్తమ రచనల సమూహముగ నెంచదగును. తెలుగునాట దొరికిన శాసనములలోని భాష సంస్కృతము లేక ప్రాకృతము. సంస్కృత ప్రాకృతములానాడు, రాజాదరణమునందు మతకర్తల ప్రోత్సాహముతోను, పండితుల వాడుకలో నుండి యుండుటయే హేతువుగా నెంచదగును. నాటి తెలుగునందు ఆనాడు కావ్యములు మత గ్రంథములు వ్రాయుటకు వీలులేకుండెనని యూహింప వచ్చును.

ఆనాడు తెలుగు జాతిజనులు -పంట కాలమున పాడుచుండిన పాటలు, పెళ్ళికాలమున గానము చేయబడిన గేయములు, సాంఘికముగ పదిమంది పల్లెవాసులు కలసినపుడు చెప్పుకొనుచుండిన ఉత్తమభావములతోకూడిన సంవాదములు సామెతలుమాత్రమే ఆనాటి వాఙ్మయ మనవచ్చును. మనము భారత రామాయణముల వంటి కావ్యములే వాఙ్మయమనియు ఇతరము గాదనియు తలంచినచో ఆనాటికి వాఙ్మయము లేదనియే చెప్పనగును. కాని ఒకజాతియొక్క అధ్యాత్మిక జీవనము నైతిక వృత్తి వీనిని తెలియజేయు రచనలే వాఙ్మయము యొక్క సారమనియు అంగీకరించినచో - ఎంతటి ప్రాథమిక స్థితిలో నుండినను ఒకానొక జాతిలోనుండినయీ రచనలే ఆనాటి వాఙ్మయముగ గ్రహింపకతప్పదు.

మనకు నేడు పరిచితమయిన ప్రారంభావస్థలోనున్న అనేక భాషలు కలవు. దీనికి లిపి, గంధ్ర రాజము లేక పోయినను ఏదో విధమైన వాఙ్మయ మున్నదని మనమనుకొనుచున్నాము అట్టి వాఙ్మయమే ఆనాడు తెలుగునకును ఉండి యుండవచ్చునని మనమూహింప వచ్చును.

పరిపుష్టమయిన వాఙ్మయము-బయలుదేరుటకు ముందుగనే పద వాఙ్మయము పదమిడును. సుమారు 1౨ వ శతాబ్ది వాడయిన పాలకుర్కి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో - తుమ్మెద పదములు, ప్రభాత పదములు, శంకర పదములు గలవని వ్రాయున్నాడు. పాలకుర్కి సోమనకాలము నన్నయ భట్టారకునికి వంద సంవత్సరములు తర్వాతిది. పాలకుర్కి సోమనాథుడు పేర్కొనిన పదములే కాకపోయినను ఇంచు మించుగ నట్టి పదములే ప్రచారములో నుండి యుండవచ్చును. కాని దానికి పండితాదరణమును, లక్షణ వ్యవస్థయు-లేక గ్రంథరూపము నంది యుండలేదు. ఆనాడు పద్య వాఙ్మయము కూడలేక పోలేదు. అద్దంకి శిలా శాసనము (క్రీ. శ. ౮4౯-౮౮౫)లో గద్య పద్యాత్మకమయిన దానిలో 'తరువోజ' అను తెలుగు పద్యము కావచ్చు మొదటి శాసనమిదియే. కందుకూరి శాసనములో (క్రీ. శ. ౯౫0) మధ్యాక్కర - విరియాల కామసాని గూడూరు శాసనములో మూడు చంపకమాలలు, రెండు ఉత్పల మాలలు కలవు.

ఇక శాసనములు పద కవితలు మాత్రమే కాక నన్నయకు పూర్వము గ్రంథ రచన జరిగి యుండునని వాదించువారు కన్నడ రత్నత్రయముగ ప్రసిద్ధి నందిన పొన్నడు -

ఆది పంపడు - రన్నడులలో రన్నడు, పంపడు తాము వేంగి దేశీయులమని చెప్పుకొనిరి. తాము వేంగి దేశీయులమని స్వజాత్యాభిమానమును ప్రకటించుకొనిన వీరు తాము తమ మాతృ భాషలో సాహిత్య వ్యాసంగము చేసిన చెప్పుకొనక యుందురా? అన్నది ప్రశ్న కాబట్టి కన్నడ భాషలో కావ్యములు రచించుటకు పూర్వము తమ భాషలో గ్రంథ రచన చేసి యుందురు. వారు వేంగి దేశీయులైనంత మాత్రమున తెలుగులో గ్రంథ రచనచేసి యుందురని నిర్ధారణగ చెప్పలేము మాతృ భాషలోతప్ప నితర భాషలలో వాఙ్మయ రచనచేసి విశేషఖ్యాతి నార్జించిన వారు ఈకాలమున మన కన్నులెదట ఎందరో కలరు కదా?

నన్నయకు పూర్వము తెలుగు దేశమున జైనమతమధిక ప్రచారములో నుండెననియు, ఆ జైనమత బోధకులు తమ మత ప్రచారమునకు తెలుగులో వాఙ్మయ రచనచేసి యుందురనియు అవి వైదిక మతోద్ధరణకై కృషిచేసిన చాళుక్య రాజులు తగులబెట్టించి యుందురనియు మరియొక వాదము. ఒక్క ప్రతియైనను వారి కంటబడక మిగిలిపోయి యుండదా? మీదు మిక్కిలి వీరి మతాభిమాన మెంత మెచ్చుకొనదగినదో — వీరు మత సహనమును అంత శ్లాఘింపదగినదే, వీరు పరమత సహనము లేనివారు కారు.

ఇక లక్షణ దీపికలో సర్వదేవుని ఆది పురాణము నుండి అని ఒక తెలుగు పద్యముదాహరింపబడినది నన్నయకు పూర్వులైన వారు తరువాతి వారు సర్వదేవ నామములో నెందరో కలరు. ఈ సర్వ దేవుడు (ఆది పురాణ కర్త) నన్నయకు పూర్వుడేయని నిర్ధారించుటకు తగిన ఆధారములు నేటికిని కానరావు

నన్నయకు పూర్వం గ్రంథ రచన సాగెనని చెప్పుటకు వీలులేదు. మొత్తము మీద సుపరిష్కృతమై వ్యవస్థితి యేర్పడిన తర్వాత తెలుగు భాషలో వెలువడిన ప్రథమ గ్రంథమే — భారతమని చెప్పవలసి యున్నది నన్నెచోడుడు నన్నయకు పూర్వుడనియు, అతని కుమార సంభవమే ప్రప్రథ మాంధ్ర గ్రంథమనియు భావించువారు కొందరు కలరు. కాని నన్నెచోడుడు నన్నయకు తర్వాతి వాడను వాదమే బలవత్తరముగ నున్నదని భావించి పెక్కులు విమర్శకు లంగీకరించుచున్నారు.

ఒక్కసారి భాగ్యనగరంలో జరుపబడిన అభ్యుదయ సాహితీ సదస్సును ప్రారంభిస్తూ శ్రీ తాపీ ధర్మారావు (తాతాజీ) గారు నన్నయ ఆది కవి కాదనీ-నన్నయ భారతము ప్రప్రథమాంధ్ర కృతికాదనీ ఎన్నో యేళ్ళ నాటి తమ వాదాన్ని పునరుద్ఘాటించారు. ఈవిమర్శ అతి ప్రాచీనమైనదేఐనా మళ్ళీ పునరుద్ధరిస్తూ పునరుద్ఘాటించారు. శ్రీ తాతాజీ—

శ్రీ తాతాజీ రాజాదరణము నందిన కవులు నన్నయకు పూర్వమే కలరనియు వారు - ప్రజల కతి సన్నిహితముగ నుండిరనియు - తమ అభిప్రాయమును వ్యక్తపరచిరి. ఇది ఊహ కల్పిత నిర్మాణముగ దోచునే కాని వేరుగాకాదు. ఇందు కెట్టి చరిత్ర కాధారములు కన్పడుట లేవుగాన అంత విశ్వసనీయముగ దోపదు.

ఇంకను పాల్కురిక్కి సోమనాధుని కాలమున 'గుర్తింపు లేదనియు, రావలసినంత ప్రతిష్ఠయు రాలేదనియు ఇట్లే నన్నయకు పూర్వులైన కవుల విషయము ప్రస్తావింప బడుట లేదనియు వ్యాఖ్యానించిరి. వీరశైవ వాఙ్మయము మహనీయమైనదేయైనను పరమత దూషణ మాకృతులలో కొన్నియెడల అవధి మీరి యుండుటచే సర్వజనా మోదమును బడయ లేదుగాని సోమనాధుని పాండితీ ప్రకర్షను - కవితా ప్రశస్తిని నిరసించి కాదు. ఈ భావన శ్రోత పఠితృలనపమార్గము పట్టించు ప్రమాదము లేకపోలేదు. సోమనాథుని కావ్యగుణములను మెచ్చుకొని తమ రచనలలో అచ్చుపడునట్లు వానిని పాటించిన పలువు రాంధ్ర కవులు కలరు. అదియే సోమనాథుని కవితా నైశిత్యమునకు నికషోపలము. సోమనాధుని పై నిరసనము మతదృష్టి పరముగా జరిగినదేకాని సాహిత్య దృష్టినైనను, భాషాది శాస్త్ర దృష్టిపైనను కేంద్రీకరించినది కాదని - అప్పట్లో శ్రీ ధర్మారావు భావించక పోవుట విచార్యము. ఒక సాహిత్య సంప్రదాయ ప్రపంతికి భగీరథ కల్పుడైన సోమనాథుడీనాడు (పరమత సహనము పాటింపబడుచున్న) పండిత భక్తి పూజల నందు కొనుచున్నాడు గదా!

నన్నయకు పూర్వపు కావ్యములు గాని అతని యితర రచనలు (భారతాంధ్రీకరణక, పూర్వము) మనకు లభించక పోవుటచే నన్నయ 'మహాభారతాంధ్రీ కరణమే' తెలుగు నాట వెలసిన తొలి కావ్యముగను - నన్నయకు పూర్వము — గ్రంథస్థమైన వాఙ్మయ కర్త లెవ్వరును వెలుగులోనికి రాకపోవుటచే నన్నయ ఆది కవి యనియు అంగీకరింపక తప్పదు. నన్నయకు తర్వాతి కవులందరును నన్నయనే ఆదికవిగా కీర్తించుటచే ఆనాటికి నీ నన్నయ రచనలే ఆది కావ్యములుగ నున్న వనుట స్పష్టము. నన్నపార్యుని 'పాయక పాక' అను పద్యమును బట్టి నన్నయ భారతమే ప్రపథమాంధ్ర కావ్యముగను, నన్నయే ఆది కవిగను భావింపవలయునే గాని వితండ వాదనమునకు లోనయి - సమస్యకు చిలవలు పలవలు కల్పించుట సబబు కానేరదు. సాహిత్య సమస్య పరిష్కార మార్గము యోచింపవలయునే గాని సమస్యనే పెంచి పోషించుట సాహిత్య శరీరారోగ్యదృష్ట్యా అభిలషణీయము కాదు. విజ్ఞులు మన్నింతురుగాక. శుభం భూయాత్

సుపాణి
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
గుంటూర్ బజార్
గుంటూర్ 522 008




కొంగి సుధాకరరావు
3/351 సదాశివపేట
ఆదోని : కర్నూలు జిల్లా.

**1. మయూర శతకము : వెల : 5.00**
**2. శ్రీనివాస శతకము : వెల : 2.00**

సంస్కృత సాహిత్యంలో శతక సాహిత్యానికి అత్యంత ప్రాశస్త్యమున్నది. అలాగే తెలుగులో కూడ గంపలకెత్తే శతక వాఙ్మయం వుంది. మకుట ప్రధానంగా వుండే ఈ శతకాలు ముఖ్యంగా భగవన్నివేదనకు సంబంధించి వుంటాయి. వినమ్రత—దాసభావము-వేదాంత తత్త్వభావాలు శతకాల్లో నిమిడి వుంటాయి. కొంగి సుధాకరరావుగారు తొలి ప్రయత్నంగా శ్రీనివాస శతకము; మలి ప్రయత్నంగా మయూరశతకం ఆంధ్రానువాదం చేశారు సంస్కృత వాఙ్మయంలో మయూరునిది ప్రౌఢశైలి. మంచి శబ్ద నైపుణ్యం-చక్కని సమాసరచన. కవిగారు మయూరుని శైలికి ముగ్ధులై తెనిగించారు. మూలశ్లోకాలకు ఏ మాత్రం తీసిపోకుండా భావం చెడకుండా అనువదించారు. కొన్ని పద్యాలు స్వతంత్రంగా కవి భావదీప్తిని ప్రకాశింపచేస్తున్నది. 'జంభారాతి దిశన్ జనించి' అన్న పద్యం నడక సవితృజవనాశ్వములవలె పరుగెత్తుచున్నవి. తమోహాలాహలం, కాలవ్యాళము, భూషణశ్మశ్రుకువులు వంటి పదాలు, చక్కని అర్థ స్ఫూర్తినిస్తున్నది. అనువాదములో ప్రజ్ఞ కనబడుతుంది. భాషమీద అధికారముద్ర వుంది.—పప్మవెద; కల్మాషములన్న పదాలు వ్యాకరణ రీత్యా దొసగులేమో అనిపిస్తుంది—అచ్చుతప్పులవల్ల కొన్నిచోట్ల పదభంగం కలుగడంవల్ల పద్యం నడక దెబ్బతింటుంది —ఇది తప్పితే అన్ని ప్లస్ మార్కులే.

ఇక పోతే రెండవది స్వతంత్ర రచన భక్తిప్రపత్తులు మూర్తీభవించే రచన. కొంత వేదాంతము-కొంత తాత్త్వికచింతన-కొంత సమాజ పరిశీలనము కానవస్తున్నాయి. 'పరవాననస్మి' భావంలేనిదే నివేదనలో తాదాత్మ్యము చెందనేరడు భక్తుడు. నరకమందు కుములు నరులమే-దుఃఖతాపవహ్నిలో దురపిల్లువారమే కనుక మానవాళికెల్ల మంగళము కలిగించుమని వేడుతాడు. జనన మరణకూప సంసార చక్రానకుములు దీనులకు ఓ మార్గం చూపించుమని భక్తితో ప్రణమిల్లే దాసభావం కనబడుతుంది. రాజకీయమందు రాజ్యపాలనకులందు స్వార్థమతిశయించినది. పాపరాశి పెరిగి పాపులు హెచ్చిన యీ సమాజంలో జరుగుచున్న అన్యాయాలకు అంత చూపించడమే-మనమూ కోరేది.

చక్కని ఆటవెలదులలో చిక్కని భావాన్ని రంగరించి శ్రీనివాసునికి పద్య నైవేద్యం సమర్పించిన శ్రీ సుధాకరరావుగారి లేఖిని మరిన్ని చక్కని కావ్యాలు వెలువరిస్తుందని ఆశించవచ్చు—

## జానపద సరస్వతి

ఆంధ్ర ప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ త్రై మాసిక పత్రిక

సంపాదకులు : నాయని కృష్ణకుమారి

విడిప్రతి వెల : 2.00

సంవత్సర చందా : 8-00

జీవిత చందా : 200-00

—తెలుగు జానపద రీతులు : జానపదుల జీవన స్థితి గతులను తెలుపుకొనే ఒక పత్రిక మనకు అవసరమయింది. విశ్వవిద్యాలయ స్థాయిలో జానపద సాహిత్యానికి ప్రత్యేకమైన గుర్తింపు వున్నది. త్రవ్వుతున్న కొద్ది గంపల కొద్దీ పుట్టుతున్న జానపద సాహిత్యాన్ని తెలియచేసే పత్రిక ఇది. ఇందులో 7 వ్యాసాలున్నవి జానపద రామాయణంలో మాయలేడి గురించి కె. శ్రీలక్ష్మి, ఎన్నో విషయాలు వివరించారు. బతుకమ్మ కథకున్న ప్రాముఖ్యతను వివరించే గేయాలుదాహరణంగా యిచ్చారు. జానపద పరిషత్తు అవతరించిన విధమును వివరించారు. జానపదుల మాటల చిందులను బి. దామోదరరావుగారు తెల్పగా—జానపదుల సుకుమార హృదయ రహస్యాలను ఎరిగిన శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు నల్లగొండ జిల్లాలోని చండూరులో సేకరించిన ఒక పాటను యిచ్చారు. భార్యను ఇంటి దగ్గర వదలి కార్యార్థియై వెంట బెట్టుకొని పోతున్న అన్న కు చెల్లెలి మీది ఆప్యాయత, వాత్సల్యపు పొంగులు ఈగేయంలో కనబడతాయి. విసురురాయి పాటల్లో జానపద స్త్రీ మనస్తత్వాన్ని ఆవిష్కరించిన వారు మాదాశి నారాయణ రెడ్డిగారు జానపదుల ఆలోచనల్ని, భావాల్ని వివరించారు. స్త్రీలకు పుట్టింటి మీది మమకారాన్ని సూచించే పదం యిక్కడుంది-చూడండి.

యాడాదికొకోక దొరికినాదాలు
పన్నెండేండ్లకురైక దొరికిన్నదాలట పుట్టింట.

ఇలాంటి సుకుమార భావాల్ని పట్టిచ్చే గేయాలతో కూడిన యీ సంచిక చదువరులకొక కానుక.

జానపద సాహిత్యం తీరు తెన్నులను తెలిపే పత్రిక ఇదే మొదటిదనుకోవచ్చు—

—o—

రావి రంగారావు కవిత

## ముఖంపుల్ల

'అమృతవృక్షము' అనే పద్య కవితా సంపుటితో తెలుగు సాహితీ పాఠకులకు పరిచయమైన రంగారావు గారు ఆధునిక కావ్య ప్రక్రియయైన వచన కవితను రాసి 'ముఖంపుల్ల' అనే సంకలన రూపంలో పాఠక లోకం ముందుంచారు. వచన కవిత ప్రతీరోజూ అభివృద్ధి చెందుతూ నవనవోన్మేషంగా విరాజిల్లుతున్నది. ఈ ప్రక్రియను నేటి యువకవులు స్వీకరించి సామాజిక స్పందనలతో రాసి రాసి తెక్కుతున్నారు. చేయితిరిగిన రచయితలే 'వచన కవిత'ను రాసి శభాష్ అనిపించుకోడానికి భయపడుతున్న సమయం ఇది. ఎందుకంటే సామాజిక ఇతివృత్తాల్ని దోసిళ్ల నింపుకొని కలం ఝుళిపిస్తున్న కవులదీ కాలం.

ముఖంలోని మాలిన్యాన్ని తొలగించే 'ముఖంపుల్ల' అనే నామకరణం చేయబడ్డ ఈ కవితా సంకలనం, సమాజంలోని రుగ్మతల్ని తొలగించడం అటుంచి కనీసం స్పష్టపరచడంలోనే కలం జంకిందని స్పష్టంగానే చెప్పొచ్చు. "నా కవితలను నేనే వ్యాఖ్యానించి పాఠకుల గ్రహణ శక్తిని కించపరచలేను" అంటూనే పాఠకుల గ్రహణ శక్తిని నిజంగానే కించపరచడం కోసం తన 'సొంత గొంతు' అనే నాలుగు పేజీల వివరణ ఇచ్చి లేని గొంతును విప్పడానికి ప్రయత్నించారు. జయ—ఘంట అనే కవితలో "బందరు నుంచి విజయవాడకు బయల్దేరాం ఇద్దరం అంటూ ఆరంభమైన

కవితను ఎక్స్‌ప్లెయిన్ చేయడం కోసం ఉపయోగించిన, రైలు, బస్సు టిక్కెట్ల దేనికీ చదివే పాఠకుల్ని. ఇబ్బందుల్లో పెడుతున్నాయి. ఇలాంటివే పరస్పరం వైరుధ్యాలున్న వస్తువుల్ని కవితా వస్తువులుగా స్వీకరించి అభివ్యక్తీకరించడంలో పప్పులో కాలువేశారు రంగారావు గారు.

'ముఖంపుల్ల'లో కర్రీ వ్యాపారుల్ని, వాళ్లకు శ్రీరామ రక్షకులైన పాలకవర్గాల్ని క్రమచేయకుండా అనుభవిస్తున్న భోగుల్ని, తన భుజం మీద నేల తల్లిని కదిలిస్తున్న రైతు వంటి వస్తువుల్నే గాకుండా కాఫీగ్లాసు కొబ్బరి చెట్టు వంటి అల్ప వస్తువుల్ని కూడా, కవిత్వీకరించడానికి ప్రయత్నం చేయడం జరిగింది.

ఈ కవికి సూర్యుడంటే చాలా అభిమానం. ఐనా సూర్యుడ్ని కావలసినంత పకడ్బందీగా వాడుకోలేక పోయారు.

'స్వయం వరం మా సందేశం
నా అల్లుడు రైతు
నా కుమార్తె ఎవరో తెలుసా
ఆమె పేరు భారతి'

ముందుగా కవిగారు ఒక స్వయంవర సందేశాన్ని అందచేశారు. ఆ స్వయం వరంలో ఎవ్వరూ తన కూతుర్ని వరించలేక పోయారు కాదు కూతురే ఎవ్వర్నీ వరించలేదు. కాని ఈ భూమిని సస్యశ్యామలం చేసి బంగారు పంటలు పండించి ఆకల్ని తీర్చే రైతును వలచింది. తద్వారా దేశానికి రైతు ఎలా ప్రాణప్రదమైన వాడో వివరించడానికి చేసిన ప్రయత్నం కనబడుతుంది.

తెల్ల చొక్కాలు
తొడిగే చంద్రుడు
పచ్చిగా తిరిగే
కొత్తరకం హంతకుడు—

అనే తెల్ల చొక్కాల దౌర్జన్యాన్ని ప్రతిబింబించే కవితా పంక్తులు చూసినప్పుడు. కవి తనకు గల సామాజిక స్పృహను వ్యక్త పరచాడనే సంతృప్తి పడాల్సి వుంటుంది.

ఆనవాయితీగా రాయించే ముందుమాట ఎవరితోను రాయించకుండా, ముందు పేజీల్లో ఏముందో చూపే విషయాను క్రమణిక లేకుండా పాఠకుల్ని డైరెక్టుగా 'ముఖంపుల్ల' నమల మనడం ఇబ్బందికరమైన విషయమే-మామూలు వ్యవహారంలో వుండి సహజమైన భాషనే ఖచ్చితంగా వచన కవితలో రాయాలి. అని పెట్టుకున్న నియమం ఇస్త్రీ బట్ట లేసుకొని నలగకుండా కూర్చోడం కోసం చేసే ప్రయత్నం మాదిరిగా వుంది. మూల్యం ఆరు రూపాయలు ఈ పుస్తకానికి ఎక్కువే.

రావి రంగారావు కవిత-ముఖంపుల్ల
మూల్యం-ఆరు రూపాయలు

ప్రతులకు : రంగారావు ఎమ్.ఏ. బి ఇ డి
తెలుగు లెక్చరర్ ఏ. సి కాలేజి
మచిలీపట్నం-521001

—శేషం. రామానుజాచార్యులు.

(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు)



**పేరు : చింతలపూడి శ్రీకుసుమహరనాథశర్మ**

వృత్తి | గ్రేడ్ 1 హిందీ పండితులు,
కార్యక్షేత్రము | శ్రీ మాజేటి గురవయ్య హైస్కూలు, గుంటూరు.

పదవులు కార్యదర్శి. పట్టణ హిందీ ప్రేమీమండలి, గుంటూరు.
కార్యదర్శి గుంటూరు జిల్లా హిందీ ప్రచారక మండలి
మరియు ఆర్గనైజరు, గుంటూరు జిల్లా స్వర్ణోత్సవ-
సంగఠక్-యోజన

అభిరుచి : హిందీ బోధన, సమాజసేవ, నాటకములలో అభినయించుట, పరిచయ పరీక్ష విషయంలో ప్రత్యేక కృషి.

చిరునామా : "కుసుమ హరకుంజ్" 1/12 బ్రాడీపేట, గుంటూరు-2

—0—



**పేరు : సి. హెచ్. కామాక్షి**

యోగ్యత : ప్రవీణ, ప్రచారక్. బి.ఏ. సంగీతంలో డిప్లొమా, టైపు హయ్యర్ (ఇంగ్లీషు)

కార్యక్షేత్రం : హిందీ పండితులు, హిందీమహావిద్యాలయం, విజయవాడ

అభిరుచి : జాతీయభాషాప్రచారం, పరిచయపరీక్ష నిమిత్తం కృషిచేశారు.

చిరునామా : 29-21-15, గోపరాజు రామచంద్రరావు వీథి, సూర్యారావు పేట విజయవాడ.



పేరు : పి ప్రభావతీ దేవి

కేంద్రం : విజయవాడ

యోగ్యత : ప్రవీణ, ప్రచారక్

అభిరుచి : పరిచయ పరీక్ష నిమిత్తం కృషి చేశారు.

కార్యక్షేత్రం : హిందీ మహా విద్యాలయం, విజయవాడ-2

చిరునామా : 29-26-52, జిదగం వారి వీధి, సూర్యారావు పేట, విజయవాడ-2

-0—



పేరు : సి. హెచ్. పర్వతవర్ధిని

యోగ్యత : విశారద- బి.ఏ. భాషాప్రవీణ (తెలుగు) కర్నాటక సంగీతంలో డిప్లొమా,

కార్యక్షేత్రం : గ్రేడ్ 1, తెలుగు పండితులు, S.B.S.R.K.R.G.H. స్కూలు; విజయవాడ-3

అభిరుచి : హిందీప్రచారం, పరిచయ పరీక్ష నిమిత్తం కృషి చేశారు.

చిరునామా : 29-12-15, గోపరాజు రామచంద్రరావు వీధి. సూర్యారావు పేట, విజయవాడ-2

